

కృష్ణాజిల్లా గాజాలోని పాఠశాలా భవనం: దీనిని 20-5-58న రాష్ట్రముఖ్యమంత్రి ప్రారంభించారు.



20-5-1958న రాష్ట్రముఖ్యమంత్రిచే ప్రారంభింపబడిన వంతెన (కృష్ణాజిల్లా దివి తాలుకాలో సూరుగ్రామం).

# ఆంధ్రప్రదేశ్

జూన్, 1958.

సంపుటి 2　　　　జ్యేష్ఠము, శాలివాహనశకము - 1880　　　　సంచిక 8

## విషయసూచిక



ముఖచిత్రం

శాసన సభ్యులు శ్రీ పైడి నరసింహాప్పారావు

(" బంగారు పంట " వ్యాసం చూడండి)

— చందా వివరాలు —

సంవత్సరానికి 2 రూపాయల 16 నయాపైసలు

విడిప్రతి వెల 18 నయాపైసలు

ఆంధ్రప్రదేశ్ సమాచార, పౌరసంబంధములశాఖచే ప్రచురింపబడి

సిటిజన్‌ప్రెస్‌లో ముద్రింపబడినది.

# ఆంధ్రమాత

శ్రీ ఐలరామాచార్యులు

జయ జయ విశాలాంధ్ర ధాత్రీ
జయ విజ్ఞానామృత దాత్రీ
నన్నయ తిక్కన యెఱ్ఱన కవితల
బమ్మెర పోతన భాగవతమ్మున
శ్రీనాథుని మధుసీసపద్యముల
తూగుటుయ్యెలల నూగిన దానవు జయ...

రాజనరేంద్రుని యాస్థానములో
రాయల భువన విజయ సౌధములో
పెద్దన తిమ్మన రుద్రన కవితల
హంసనడలతో నలరిన దానవు
రామకృష్ణ నవకవితారసముల
బట్టుమూర్తి పలికిన కావ్యములో
మొల్ల కవిత్వపు మల్లెపందిరిని
అలరారుచు మైమరచినదానవు జయ...

బ్రహ్మమునుడివిన తత్త్వపథములో
భక్తరామదాసుని కీర్తనమున
త్యాగయ క్షేత్రయ సంగీతములో
మధుర నాట్యములొనర్చిన దానవు
కందుకూరి, గురిజాడ, అడవి
సాధించిన నవకవితాస్రవంతిలో
చిలకమర్తి తిరుపతివేంకటకవి
వరుల శైలిలో వరలిన దానవు జయ...

మూడుప్రాంతముల ముగ్గుర పుత్రులు
మువ్వన్నియ జెండాలనందుకొని
నీవిభవమునకు నివాళులెత్తుచు
నీ పెంపునకై సేవచేసెదరు
జయ జయ విశాలాంధ్ర ధాత్రీ
జయ విజ్ఞానామృత దాత్రీ.

# బంగారు పంట

## రెండవ పంట వరి అధికోత్పత్తిలో ఘన విజయం

(శ్రీ ఏ. వి. రామచంద్రరావు, బి. ఎస్. సి. వ్రాత.)

(వ్యవసాయ డిమాన్‌స్ట్రేటరు, పాలకొండ, శ్రీకాకుళం జిల్లా)

| | | |
|---|---|---|
| 1. | పంట పండించిన చేను | పాలకొండ తాలూకా పాలకొండ గ్రామంలోనిది. |
| 2. | రైతు పేరు | శ్రీ పి. ఎన్. అప్పారావు, శాసన సభ్యులు. |
| 3. | వరి రకం | ఎమ్. టి. యు. 9 (గరికసన్నాలు) |
| 4. | పంట రకం | రెండవ పంట |
| 5. | ఉత్పత్తి | మాగాణీ భూమిలో యెకరానికి 7990 పౌన్లు |
| 6. | భూమి రకం | నల్లరేగడనేల |

శ్రీకాకుళం జిల్లా పాలకొండ తాలూకా పాలకొండ గ్రామంలో మాగాణీ భూమిలో రెండవపంట వరి పంటలో యెకరానికి 7,990 పౌన్లు లేక 49 బస్తాల 140 పౌన్ల ధాన్యం పండినది. ఈపంటను పాలకొండ నియోజక వర్గ శాసన సభ్యులు శ్రీ పి. ఎన్. అప్పారావు పండించారు. ఆయనకి ఊపిరిసలపని కార్యక్రమాలెన్నో వుండి, తగినంత వ్యవధి లేక పోయినప్పటికీ ప్రభుత్వం పిలుపును వెంటనే అందుకొని తమ పొలంలో ఈ విధంగా రెండవ పంట వరిని పండించారు. అధికతమ వుత్పత్తిని సాధించుటకై ఆయన ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని అవలంబించారు.

ఇంత హెచ్చు వుత్పత్తిని సాధించుట కాయన అవలంబించిన పద్ధతి వివరాలు యివి :

1. అదే పొలంలో ప్రథమ పంటలో 45 బస్తాల 110 పౌన్లు వుత్పత్తి అయినది.

2. ప్రథమపంట డిసెంబరు ఆఖరి వారంలో కొయ్యబడింది.

3. ఒక సెంటు భూమిలో ఆధునిక శాస్త్రీయ పద్ధతుల్లో నారుమడిని పెంచి జనవరి 25 వ. తేదీనాటికి నారు సిద్ధం చేయబడింది.

4. రెండవపంటకి యెక్కువ వుత్పత్తి నిచ్చే ఎమ్. టి. యు. 9 (గరికసన్నాలు) రకం వుపయోగించబడింది.

5. నారు సకాలంలో వూడ్పు (నాట్లు) బడింది.

6. విత్తనాలు చల్లిన పదిహేనో రోజున నారుమడికి మూత్రిక వుపయోగించబడింది.

7. నారు మామూలు పద్ధతిలోనే వూడ్పబడింది. ఊడ్పుకి ముందు పొలంలో సూపర్ ఫాస్ఫేటు, 4000 పౌ. గ్రామీణ పెంట యెరువు వెయ్యబడింది.

8. పెంట యెరువు ఒక వారం రోజులు నానిన పిమ్మట పొలం వూడ్పబడింది.

9 ఊడ్పు జరిగిన 20 వ రోజున 150 పౌ. మూత్రిక వాడబడింది. దీనిలో 60 పౌ. నత్రజని వుంటుంది.

10. ఈ పొలం సహజంగా సారవంతమైనది. దొలుచుడు పురుగువల్ల నష్టం సంభవించే లక్షణాలు కనపడకముందే ఆ విషయంలో ప్రభుత్వ శాఖ యిచ్చిన ఆదేశాల ప్రకారం పైరుపై 'ఎండ్రిన్' జల్లబడింది.

వ్యవసాయానికి పరిశోధన గీటురాయివంటిది. విస్తరణ కార్యక్రమం దానికి మెరుగులు దిద్దుతుంది. పరిశోధన విస్తరణ కార్యక్రమానికి కీలకం. ఈ సందర్భంలో యీ విషయాల్ని మనం జ్ఞాపకముంచుకోవాలి. ఆధునిక వ్యవసాయ పద్ధతులలో నమ్మకమున్న రైతులే పై విషయం నిజమని ఋజువు చేయగలరు.

ఈ రైతు శాసన సభ్యుడు. ఆయనకుగల కాలవ్యవధి తక్కువ. అయినప్పటికీ కూడా ఆయన మామూలు పద్ధతిలోకంటె రెట్టింపు యెక్కువ ధాన్యాన్ని పండించేరంటే అది నిజంగా చాలా గమనార్హమైన విషయం. ఒక పర్యాయం యీ దిగువ పట్టికను పరికిస్తే వుత్పత్తి తారతమ్యం వివరాలు సుబోధకం కాగలవు.

| వరుస సంఖ్య | ప్రదర్శనజరిగిన ప్రదేశం | ఆయాసంవత్సరాలలో యెకరావుత్పత్తి | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| | | 1935-36 | 36-37 | 37-38 | 38-39 | 39-40 | 40-41 |
| 1. | మారుటేరు | 1538పౌన్లు | 1766పౌ | 2530 పౌ | 2530 పౌ | 2370 పౌ | 3440 పౌ |
| 2. | సామర్లకోట | — | 2088 ,, | 1757 ,, | 1757 ,, | 1379 ,, | 2117 పౌ |

( 1936-37, 39-40, 40-41 సంవత్సరాలకి సంబంధించిన మద్రాసువ్యవసాయకేంద్రనివేదికలుపై సమాచారానికి ఆధారమైవున్నవి. )

1940-41 తరువాత 3440 పౌన్లకంటె యెక్కువ ధాన్యంవుత్పత్తి అయినవనుటకు నాకు తెలిసినంత మటుక్కి ఆధారమెక్కడాలేదు. కాబట్టి యిప్పటికి పండించబడిన(ప్రస్తుత రైతుచే)గరిష్ఠ పంట 7980పౌ, 3440 పౌ. మధ్యగల తేడాను నేను వివరించటం అనవసరం. ఆతేడా చాలాస్పష్టంగా వున్నందున ప్రత్యేకవివరణ అవసరంలేదు. నత్రజనియెరువుల వాడకంవల్ల భూమిని మరింత సారవంతంచేసి మరింత యెక్కువపంటని సాధించవచ్చునని పైవుదంతం విశదపరుస్తున్నది. ప్రస్తుతపు అధికోత్పత్తికిదిగువ మూడుచర్యలు కారణమైవున్నవి.

1. సకాలంలో పనిజరపడం.
2. సారవంతమైన భూమిలో మొక్కల్నిపలచపలచగా పెంచి, మంచి యెరువుల్ని వెయ్యడం.
3. పంటని వృధాపోనివ్వకపోడం, సస్యరక్షణ. ప్రధమపంటపైరుని పొలంలో అధమపక్షం 2 నెలలైనావుంచితే యెకరానికి 8000-9000 పౌనులధాన్యంపండుతాయి. రెండవపంట పైరుని ప్రధమ పంటపైరుకంటె మరో 25 రోజులు యెక్కువవుంచాలి.

## గమనార్హం

1. శ్రీకాకుళం జిల్లా వ్యవసాయాధికారి పైరును 2-5-58 న తనిఖీచేశారు. ఇది మంచిపంటకిదోహదకారిఅయింది.
2. పైరు కోతజరిగేరోజున (4-5-58) పార్వతీపురం ఆర్. డి. ఓ. స్వయంగా పొలాన్నితనిఖీచేశారు.

3. తాలూకా వ్యవసాయ సంఘసభ్యులలో ప్రముఖులంతా యీ సత్ఫలితాన్ని ప్రసంశించారు.

### శాస్త్రీయ విషయాలు

1. వరిపైరు ఎత్తు : 5అ. 6 అం.

2 ఒక్కొక్క మొక్కకున్న కొమ్మలు : 69

3 గింజలు (ఒక్కొక్కవెన్నులో వున్నవి.) 345

4 చిట్టు 0.5 %

5 దోలుచుడుపురుగు వున్నట్లు కనుగొనబడిన తే. 4-2-58

6. తన్నిరోధానికైవాడినమందు : ఎండ్రిన్

7. పచ్చియెరువు : ఆకులు

8. నత్రజని యెరువులు : మూత్రికరూపంలో 60 పౌ. నత్రజని

9. భాస్వరం యెరువులు : సూపర్ ఫాస్ఫేటు (ఎకరానికి 100 పౌనులు)

10. వరివంగడం : ఎమ్. టి. యు. 9 లేక గ. కిసన్నాలు

11. ఎకరానికయిన ఖర్చు : రూ. 285.25

12. ఎకరాపంట (విలువ) : రూ. 1593

13 నికరలాభం : రూ. 1110.75



# క్షయ నివారణ

## అగ్ర ప్రాధాన్యాన్ని కోరే ప్రజా సమస్య

(డా. ఎఫ్. లోవెస్)



రోగిని పరీక్షిస్తున్న దృశ్యం.

క్షయ పెద్ద ప్రపంచ సమస్య అన్నది గుర్తించబడిన విషయం. క్షయ, మలేరియా, సుఖవ్యాధులు అంటువ్యాధులని, వ్యాధి నివారణ కార్యక్రమంలో వాటికి అధికతమ ప్రాధాన్యత యివ్వబడాలని జరిగిన నిర్ణయంతో ప్రపంచ ఆరోగ్య సంస్థ నిపుణుల కమిటీ పూర్తిగా యేకీభవించింది.

అంటువ్యాధుల నిర్మూలన మొత్తం మానవ జాతికి సంబంధించిన వ్యవహారం. కాబట్టి సంయుక్త రాజ్య సమితి తనకిగల సాధన సంపత్తిని ప్రత్యేక యేజన్సీల ద్వారా ప్రపంచంలో అవసరంలో వున్న ప్రాంతాలకి అందజేస్తున్నది.

క్షయ నివారణ కార్యక్రమానికి రెండు ఆశయాలున్నాయి. ఒకటి, యేటా యేరకం క్షయ తగలటం వల్ల సమాజానికి నష్టం కలుగుతున్నదో ఆ రకం క్షయ తగిలే వ్యక్తుల సంఖ్యను తగ్గించటం. రెండవది, క్రమేణా అసలు ప్రజలు క్షయ వ్యాధికి గురి కాకుండానే నివారించటం. కాబట్టి యీ కార్యక్రమాన్ని యిందుకనుగుణంగా నడపవలసి వుంటుంది.

ఈ సమస్య నెదుర్కొనే విధానాన్ని ముందు ముఖ్యంగా మూడు మాటల్లో చెప్పి, ఆ తరువాత ఒక్కొక్కదానినే విడిగా వివరిస్తాను.

1. క్షయ అంటు వ్యాధి.

2. క్షయ నివారణ యీనాడు కేవలం క్లినికల్ సమస్యకాక ప్రజారోగ్య సమస్యగా పరిణమించింది.

3. పథకనిర్మాణం, కార్యక్రమాల వివిధ నిర్ణయాలు వాస్తవ విషయాలపై ఆధారపడాలి. అలాగే నివారణోపాయాలు, నివారణ పద్ధతుల విషయంలో సిఫార్సులు, నిర్ణయాలు కూడా.

(పట్ల ఆలోచనలు, వూహలు కనీస అవధికి పరిమితమై వుండాలి)

## 1. క్షయ అంటువ్యాధి

"క్షయ కొంత వైద్య అంశగల సాంఘిక వ్యాధి" అని యిక్కడికి 50 సంవత్సరాలుగా చెప్పబడుతున్నది. అంటే-దీని నివారణకి ముఖ్యంగా దేశం



దబీర్‌పూరా (హైదరాబాదు)లోని టి. బి. కేంద్రాన్ని 15-5-58న రాష్ట్ర ముఖ్య మంత్రి ప్రారంభించారు.

లోని సాంఘిక, ఆర్థిక పరిస్థితుల్ని అభివృద్ధి పరచాలి. ఇంకా ఆధునిక పద జాలంలో చెప్పాలంటే ప్రజల జీవన ప్రమాణాన్ని అభివృద్ధి పరచాలి. ప్రజల సాంఘికపరిస్థితులకి, వారిలో క్షయవ్యాధి వ్యాప్తికి మధ్య చాలా దగ్గర సంబంధం, కాదు అన్యోన్య సంబంధమే వున్న మాట నిజం. కాని ఆచరణలో దీనిని ప్రాతిపదికగా తీసుకుంటే నేరుగా వ్యాధి నివారణకై తీసుకునే చర్యలు పని చేయవనే అర్థమిస్తుంది. ఆ పైన క్షయ సాంఘిక వ్యాధి అన్నమాటని ప్రపంచంలో అన్ని ప్రాంతాలూ చాలా రోజులుగా దాని నివారణకై కృషిచేయక పోడానికి సాకుగా తీసుకుంటున్నవి.

క్షయ 'ట్యూబర్కిల్ బాసిల్లి' అనే సూక్ష్మ జీవుల ద్వారా వ్యాపిస్తుంది. ప్రజలలో క్షయ వ్యాపించే విధానాన్ని, ప్రాణాంతకమై యీ సూక్ష్మజీవులు సాగించే పోరాటాన్ని గురించి మనం తెలుసుకుంటే వాటి నిర్మూలన సులభమవుతుంది. ఈ విషయాలు మన కెంత యెక్కువగా తెలిస్తే వ్యాధి నివారణకై మనం చేసే కృషి అంత యెక్కువగా ఫలిస్తుంది. మనకి గల విషయ పరిజ్ఞానంతో కనీస ఖర్చుతో గరిష్ఠ ఫలితాల్ని సాధించుటకు యెక్కడెక్కడ యేయే కట్టుదిట్టాల్ని చేయాలో చేసి, తద్వారా దాని నరికట్టాలి.

## 2. క్షయ ప్రజారోగ్య సమస్య

క్లినికల్ సమస్య, ప్రజారోగ్య సమస్యలకు కల భేదమేమిటో ముందు చెప్పడం అవసరం. క్లినికల్ వైద్యంలో మన శ్రద్ధ రోగిపై అనగా ఆ జబ్బుగల వ్యక్తిపై కేంద్రీకృతమై వుంటుంది. ప్రజారోగ్య విషయంలో ఆ శ్రద్ధ మొత్తం సమాజం పైకి ప్రసరిస్తుంది. అంటే వ్యక్తి సమస్యలకి, సమాజ మొత్తం సమాజంలోని వ్యక్తులందరి ఆరోగ్య ప్రమాణాన్ని సాధ్యమైనంత హెచ్చు స్థాయిలో వుంచడానికై అతడు ప్రయత్నిస్తాడు. ఆరోగ్య వంతులు వ్యాధిగ్రస్తులు కాకుండా జాగ్రత్త వహించడము, వ్యాధిగ్రస్తుల్ని తిరిగి ఆరోగ్యవంతులుగా చేయడము రెండూ కూడా అతడి కార్యక్రమం క్రిందకి వస్తాయి.



డా. ఎఫ్. లోవెన్ ప్రసంగిస్తున్న దృశ్యం.

సమస్యలకి మధ్యగల అంతరమే క్లినికల్, ప్రజారోగ్య సమస్యల మధ్య వుంటుంది.

క్లినిక్‌లో చికిత్స బాధ్యతని వహించే వ్యక్తి తన రోగికి జబ్బు నయంచేసి, మళ్లీ మామూలు మనిషిని చేయుటకు ప్రయత్నిస్తాడు. రోగ లక్షణాన్ని గుర్తించి, తన్నిరూపణకి సంబంధించిన వివిధ సమస్యలను అర్థం చేసుకుని రోగులకి సరైన చికిత్స చేయడానికై చికిత్సకుడు శిక్షణ పొందుతాడు. ప్రజారోగ్య అధికారి పని యిందుకు భిన్నమైనది,

ఒక దశాబ్దం వెనుకటి వరకూ క్షయ నివారణ ముఖ్యంగా క్లినికల్ సమస్యగా వుండేది. ఆ రోజులలో అది ప్రత్యేక శిక్షణపొందిన చికిత్సకుని రోగ లక్షణ నిర్ణయంపై ఆధారపడి వుండేది, ఆ రోజులలో అలా వుండవలసి వచ్చేది కూడా. ఆ రోజులలో క్షయ నిపుణుడంటే 'థైసియాలజీ' (క్షయ) అనే ప్రత్యేక క్లినికల్ వైద్యంలో గుర్తించబడిన ఫార్మల్, ప్రాక్టికల్ శిక్షణను పొందిన వ్యక్తి. అట్టి

నిపుణుల కృషి ప్రాతి పదికగా లేని క్షయ నివారణ కార్యక్రమం అప్పుడు అనూహ్యం. క్షయ నివారణకి గల పెద్ద ఆటంకాలలో యీ నిపుణుల కొరత ఒకటి. మరొక ఆటంకం సమర్ధమైన చికిత్స జరుపుట కవసరమైన సంస్థలను నెలకొల్పి, నడుపుట కయే ఖర్చు. బి.సి.జి. టీకాలు, క్షయనిరుగుడుమందులవంటి నిరోధచర్యల్ని, రోగ నిర్ణయానికి కొత్త పద్ధతుల్ని ప్రవేశ పెట్టడంతో, యిప్పుడు పరిస్థితిబాగామారింది.

క్షయ విరుగుడుమందుల్ని శ్వాసకోశ సంబంధమై అంటు లక్షణంగల క్షయకి యింట్లోనే వుండి వాడి సత్ఫలితాన్ని పొందవచ్చు. ఇందు నిమిత్తం ఆస్పత్రులు, ఆరోగ్యసదనాలు మున్నగు ఖర్చుతో కూడిన సంస్థలు అవసరంలేదు. రొమ్ము పరీక్షకి అంత యెక్కువ ఖర్చు లేని సులభ పద్ధతి (ఫొటో ఫ్లూరోగ్రఫీ) ప్రవేశ పెట్టబడింది. సౌకర్యాల పెంపుదలతో యెక్కువమంది ప్రజలు క్షయనుంచి విముక్తి పొందుటకై ప్రయత్నిస్తున్నారు. అందుకే యీనాడు మనం "క్షయ నివారణ కొంత క్లినికల్ అంశ గల ప్రజారోగ్య సమస్య" అనే అభిప్రాయాన్ని వెలిబుచ్చడానికి అవకాశ మేర్పడింది.

మనం యీ అభివృద్ధి ఫలితాల్ని స్వీకరించాలి. అది యెంత సహజమో అంత అవసరం కూడాను. అనేకంగా వున్న యీ ఫలితాలు క్షయనివారణ విషయంలో మన మూల దృక్పథం పూర్తిగా మారిందన్న విషయాన్ని సూచిస్తాయి.

సమాజదృక్పథ మంటే ప్రజా సాముహిక దృక్పథమే. ఎంచేతంటే మనంతీసుకునే చర్యలు ప్రజలలోచాలమందికి వుపకరించాలి. కాబట్టి మన పద్ధతులు మున్నగువానిని తదనుగుణంగా మార్చుకోవాలి. అంటేదానికి సాధారణమైన అర్థంయిది: అవి క్లిష్టమైనవి, ఖర్చుతో కూడుకొన్నవి కాకూడదు. కాని మళ్లీ సమర్థంగా పనిచేయాలి. ఆపైనప్రజలసామూలు జీవితంతో యెంతమాత్రం జోక్యం కలుగచేసుకోకుండా వాడ్డానికనువైవుండాలి.

క్షయనివారణ సమాజసమస్య కనుక దాని విషయం సమాజం యితర సమస్యలతోకలిపి ఆలోచించాలి. దానిని సాధారణ ప్రజారోగ్య కార్యక్రమంలో ఒక భాగంగావిలీనంచేయాలి క్షయనివారణ కార్యక్రమాన్ని రూపొందించే బాధ్యతని ప్రజారోగ్యంలో శిక్షణపొంది, అనుభవంగణించిన డాక్టర్లు వహించాలి. అదిజమలు జరుగవలసిన విధానాన్నికూడా వారే నిర్దేశించాలి.

### 3. ప్రాతి పదిక వాస్తవ విషయాలే

దీనిని యెక్కువ వివరించవలసిన అవసరంవుండ కూడదు. కొన్నేళ్ళ క్రితం క్లినికల్ మెడిసిన్ ప్రొఫెసరొకాయన తన పదవీవిరమణ సమయంలో తన అనుభవాన్నొక దానిని చెప్పారు. వైద్యంలో శాశ్వతసత్యాలనబడేవి సగటున నాలుగు సంవత్సరాలఆయుర్దాయాన్ని ఆశించేవిట. యీ అల్పాయుర్దాయానికి కారణం మనస్సు కలాతోచడమే. ఇలా 'మనస్సుకుతోచిన' విషయాల్ని ప్రజారోగ్యంలోనికి చొప్పించడం ప్రమాదకరం. కాబట్టి అలాజరుగకుండా మనం జాగ్రత్తవహించాలి. అయితే కొన్ని ప్రత్యేక సందర్భాలలో నిర్దిష్టమైన విషయపరిజ్ఞాన సేకరణకి పూర్వమే చర్యతీసుకోవలసిన అవసరమేర్పడవచ్చు. అప్పుడు తప్పనిసరిగా చర్యతీసుకున్నా, అది ప్రత్యేక పరిస్థితులలో తీసుకునే అత్యవసరచర్య అనే విషయాన్ని స్పష్టంగా తెలుసుకోవాలి. అట్టికేసుల సంఖ్యని కనీస అవధికి పరిమితంచేయాలికూడా.

క్షయవ్యాధిని ఒక పద్ధతిప్రకారం నిర్మూలించాలంటే స్పష్టంగా నిర్వచించబడిన అయిదు రంగాలలో కృషిజరగాలి. అవియివి:-

1. క్షయవ్యాధివున్న వ్యక్తుల్ని తెలుసుకోవడం.
2. వారిని విడిగావుంచి, చికిత్స చేయడం
3. నిరోధం.
4. జబ్బుమళ్లిన తరువాత రోగులకితగు సౌకర్యాలుకల్పించి, అనంతర రక్షణ కేర్పాటుచేయడం.
5. ఈ వ్యాధివల్ల కష్టపడుతున్న కుటుంబాలకి సాంఘికంగా, ఆర్థికంగా రక్షణకల్పించడం. విడిగా అయితే యిందులో యేఒక్క కార్యక్రమమూ బాగాపనిచేయదు. అవన్నీకలిసి, సరైన క్రమంలో పనిచేయాలి.

అంటువ్యాధీ నివారణ, ప్రజారోగ్యానికి సంబంధించిన సాధారణ చర్యలు ఆని క్షయనివారణ కార్యక్రమంలో రెండు భాగాలున్నవి. దీనికి దేశసహితమై సవివరమైన పథకాన్ని నిర్మించడానికి మనం తెలుసుకోవలసిన విషయాలు చాలా వున్నాయి. ఈ విషయంలో ప్రస్తుతం ప్రపంచ ఆరోగ్యసంస్థ చాలా కృషిచేస్తున్నది. ఆచరణ యోగ్యమైన కార్యక్రమానికవసరమైన విషయాల్ని పరిశోధన ద్వారా తెలుసుకోవాలి కాబట్టి యీ సంస్థ పరిశోధనకి ప్రోత్సాహాన్నిస్తూ, జరిగే పరిశోధనల్ని సమన్వయపరుస్తూ అవసరమైనప్పుడు తానే స్వయంగా పరిశోధనలు సాగిస్తూ యీ విషయంలో పాటుపడుతున్నది.

## ప్రపంచ ఆరోగ్య సంస్థ సహాయం

ప్రపంచ ఆరోగ్యసంస్థలో 88 రాజ్యాలకి సభ్యత్వమున్నది. కాబట్టి, విషయపరిజ్ఞానాన్ని, అనుభవాన్ని గణించడానికి దానికిసాటిలేని అవకాశాలున్నాయి. అంతేకాక ప్రపంచంలో యే ప్రాంతంనుంచైనా ఆరోగ్యానికి సంబంధించిన నిపుణులనైనా సైతం అది పొందగలదు

క్షయనివారణలో అంతర్జాతీయ సంబంధంగల (దేశసరిహద్దులు దాటగల వ్యాధివ్యాప్తి అర్థంలో) సమస్యలు కొన్ని వున్నప్పటికీ, దేశంలో క్షయ నివారణ ప్రతిదేశానికి ప్రధానసమస్యగా వున్నది. కాబట్టి క్షయ నివారణకై ఆ యా దేశప్రభుత్వాలు జరిపే కృషికితోడ్పడ్డం ప్రపంచ ఆరోగ్యసంస్థ ఆశయమైవున్నది. ఈ సందర్భంలో యీ సంస్థ ఆయాప్రభుత్వాలకి ప్రత్యక్షంగాను, పరోక్షంగాను కూడా సహాయపడుతుంది. బోధన, శిక్షణ, ప్రదర్శనలనిమిత్తం ప్రాజెక్టులయేర్పాటులో అది ఆ ప్రభుత్వాలకి తోడ్పడుతుంది.

ఇంతవరకూ క్షయనివారణరంగంలో ప్రపంచ సంస్థనుంచి ప్రభుత్వాలకి వచ్చిన సహాయం యీ తరగతి క్రిందనే వచ్చింది. అట్టి ప్రాజెక్టులకై యీ సంస్థ వాటికి ప్రత్యేకంగా ఉద్దేశించబడిన సిబ్బందిని లభింపచేస్తుంది. తరుచు పరిమిత పరిమాణంలో సరుకును, పరికరాల్ని కూడా సరఫరా చేస్తుంది. ప్రపంచ సంస్థ సిబ్బంది, పథకనిర్మాణం, కార్యక్రమ అనుబు మున్నగు పనులు యెలాచేయాలో ఆయా దేశాల సిబ్బంది కెరుక పరుస్తుంది.

ఈ విధంగా, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ కోరిక ననుసరించి ప్రపంచ ఆరోగ్యసంస్థ అంతర్జాతీయ సిబ్బందిని, అలాగే పరికరాలు, వస్తుసామగ్రి కూడా హైదరాబాద్‌కి పంపింది. ఇవియిక్కడ క్షయ శిక్షణ, డొమిసిలరీ సర్వీసు సెంటరు యేర్పాటులో అక్కడిసౌకర్యాలు సిబ్బందికి జతచేసి వుపయోగించబడినవి.

ఈ కేంద్రము హైదరాబాదు సికింద్రాబాదు నగరాలలోని వివిధమైన దానిశ్రవి కేంద్రాలు యేవిధమైన ఆటంకాలు లేకుండా తరువాత పనిచేయగలవు. ఆంధ్రప్రదేశ్‌లో క్షయతో జరిపే పోరాటంలో యివి పటిష్టమైన కేంద్రస్థానంగా పనిచేయగలవుకూడా.

ఈ కార్యక్రమం పూర్తయిన తరువాత జిల్లాల్లో పని ప్రారంభం అవుతుంది. ఈపని జిల్లా సమాజాభివృద్ధి కేంద్రాలలోని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలలో జ?గేసిబ్బంది సహాయంతో జరపబడుతుంది. ఈవిధంగా మనం పల్లెటూరి ప్రజలకి సేవచేయగలుగుతాం.

ప్రస్తుత తరాన్ని క్షయరోగంనుంచి విముక్తి చేయుటకేమి, భావి తరాలను యీ అనర్థంనుంచి రక్షించుటకేమి, జాతీయ, అంతర్జాతీయ ప్రాతిపదికపై కృషి జరుగుతూనే వుండాలి. సౌష్ఠవమైన క్షయనివారణ కార్యక్రమంలోనైనా వ్యాధినిరోధం, ఆతరువాత పూర్తి నిర్మూలనలకి అవకాశముండాలి. ప్రజల దారిద్ర్యం, తగినంత ఆహారం, వసతి సౌకర్యాలు లేకపోవడం, లాభదాయకమైన వృత్తుల్ని చేపట్టడానికి తగిన అవకాశాలలేమియివి యీకృషినిమరీక్లిష్టంచేస్తాయి. కాబట్టి ప్రపంచంలో యెక్కడెక్కడగల వస్తుసామగ్రి మున్నగువాటిని ఒకరికొకరు యిచ్చుకొని, వాటి వల్ల మిక్కిలి స్వల్పవ్యవధిలో అత్యధిక ఫలితాలు చేకూరేట్టుగా వ్యవహరించాలి.

---

ప్రపంచ ఆరోగ్యసంస్థ నిపుణుడు డా. లోవెక్ యిప్పుడు హైదరాబాదు దబిర్‌పురాలోని క్షయ శిక్షణ, డొమిసిలరీ సర్వీసు సెంటరులో పని చేస్తున్నారు.

# హైదరాబాద్ బాలసంక్షేమ సంస్థ

( మిస్టర్ టి. డబ్ల్యు. లాటూష్ )



'మార్కసు బాయ్స్.. టౌన్.' (ప్రారంభదశలో యిలా వుండేది.)

భావిభారత పౌరులైన బాలుల సంక్షేమ కృషికి కంకణం కట్టుకున్న ఉత్తమ సంస్థఒకటి ఆంధ్రప్రదేశ్‌లో ఉన్నది. అట్టి సంస్థ భారత దేశంలో మరే రాష్ట్రంలోను లేదు. కాబట్టి యీ విషయంలో ఆంధ్రప్రదేశ్ దానికదే సాటి. ఈ సంస్థ అమెరికా నెబ్రాస్కా లోని 'బాయ్స్ టౌన్' పద్ధతిలో నెలకొల్పబడింది. అమెరికా సంస్థను ఫాదర్ ఫ్లానగన్ నెలకొల్పారు. లోకంలో అసలు చెడ్డపిల్లలు లేరనీ, వున్నదల్లా చెడ్డతల్లిదండ్రులు, చెడ్డ పరిసరాలు, చెడ్డ ఆదర్శాలేనని ఋషితుల్యుడైన ఫ్లానగన్ పరమవిశ్వాసం. ఈ విశ్వాసానికి తగ్గట్టే ఆయన స్థాపించిన సంస్థ ప్రపంచం వివిధ ప్రాంతాలలో భావి పౌరులు ముఖ్యంగా దిక్కులేని పిల్లలు, బాలనేరస్థుల శిక్షణలో నిమగ్నులైన సాంఘిక సేవకులకి కార్యోత్సాహాన్ని కలిగిస్తున్నది.

'ఆల్ సెయింట్సు హైస్కూల్'కి శాశ్వతమైన శత వార్షిక స్మృతిచిహ్నంగా సెయింటు గేబ్రియల్ ఇండియన్ బ్రదర్సుచే ఆంధ్రప్రదేశ్‌లో నెకొల్పబడిన సంస్థపేరు 'మార్కసు బాయ్స్ టౌన్' (బాలుల సంక్షేమసంస్థ). హైదరాబాదు తొలి భార



కొత్త పాఠశాలా భవనాన్ని రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి ప్రారంభించారు.

తీయ ఆసక్తి విశేషంగా వుంది. యీ సంస్థ విజయానికి నైతికంగా, భౌతికంగా మిక్కిలి తోడ్పడిన మోస్ట్ రవరెండు మార్కు గోపు పేరు దీనికి పెట్టడం చాలా సమంజసం. బహుపురాతనమైన హైదరాబాదు శివార్లలో సుందరమైన జహానుమాలో నెలకొల్పబడిన యీ సంస్థను పూర్వ హైదరాబాదు రాష్ట్ర ముఖ్యమంత్రి డా. బి. రామకృష్ణరావు 11-10-1955 న ప్రారంభించారు.

## కొత్త భవనం

అనాధలు వగైరా పిల్లల పాఠశాల మొదట పూరిపాకలలో వుండేది. దాని వసతి సౌకర్యానికై రూ. 50,956 ఖర్చుపై ఒక భవనం నిర్మించబడింది. ఈ కొత్త భవనానికి 18-12-1957న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి ప్రారంభోత్సవం చేశారు. దీంతో యీ పిల్లల సంస్థ ఒక అంగ ముందుకు వేసింది.

ఏకాకులు, అనాధులు, దిక్కులేని పిల్లల పునరావాస సమస్య చాలా కఠినమైనది. దాని సత్వర పరిష్కారానికై పంచవర్ష ప్రణాళికలలో భారతదేశ ప్లానింగు కమిషన్ కొన్ని ముఖ్యమైన సిఫార్సులు చేసింది. పిల్లల గ్రామాలు, బాయ్స్ టౌన్ల వంటి ప్రత్యేక సంస్థల స్థాపన ద్వారా మార్కసు బాయ్స్ టౌన్ యీ సిఫార్సులలో ఒకదానిని అమలు జరుపుతున్నది. భారతదేశ పథక నిర్మాతలు బాయ్స్ టౌన్లనే తాము కోరుతున్నట్లు స్పష్టంగా చెప్పారు. ఎందుచేతంటే, యెక్కువమంది పిల్లల్ని ప్రత్యేక సాంఘిక సేవా సంస్థల రక్షణక్రిందకి తేవడమనే మూల ప్రయోజన సిద్ధికై అవి ఉత్తమంగా కృషి చేసాయి. పిల్లల సహాయ సంఘాలవంటి సంస్థలకి సేవావకాశాలు, సౌకర్యాలు పరిమితంగా వుంటాయి. కనుక అవి బాయ్స్ టౌన్లలా పనిచేయలేవు. ఇక్కడ ప్రత్యేక సాంఘిక సేవాసంస్థలంటే యెటువంటివో ఫాదర్ ఫ్లానగన్ ఇలా వివరించారు: కొత్త తరగతి సంఘ సేవకుల్ని తయారు చేసేవి: వారు కేవలం వృత్తి వ్యాపారాదుల్లో గణుతికెక్కితే



'బాయ్స్ టౌన్'లో వడ్రంగం పని.



కుట్టుపని

చాలదు. అంతకంటె ముఖ్యమైన పవిత్ర కర్తవ్యం ఆత్మోన్నతి సాధనలో దిక్కూ మొక్కూ లేని పిల్లల శుష్క జీవితాలపై దయా వాత్సల్య ఆదరామృతాన్ని చిలికి. మాతృప్రేమను చవి చూపించి వాటిని చిగురింపచేయాలి".

భారతదేశ పథక నిర్మాతల సిఫార్సుల్ని అంగీకరించుటేకాక అమలు సైతం జరుపుతున్న అనధికార సంక్షేమ ఏజన్సీలలో కేథలిక్ సాంఘిక సంక్షేమ సంస్థలు ప్రముఖమైనవి. పథక నిర్మాతల మాటలలో అవి చాల దశాబ్దాలుగా దిక్కులేని పేద పిల్లలెందరికో "రక్షణను కల్పించి, నిలువ నీడనిచ్చి, విద్యాబుద్ధుల్ని" చెప్పిస్తున్నవి. దేశీయ, విదేశీయ కేథలిక్ మిషనరీలు స్వార్థ త్యాగంతో కృషిచేసి, విద్యా, సాంఘికాభ్యుదయ రంగాలలో సాధించిన ఫలితాలకి ఇండియా వారికి ఋణ పడివున్నది. భారత అగ్రనాయకులు, విద్యావేత్తలు కూడా వారి యీ సేవను గుర్తించి, మెచ్చుకొనడం జరుగుతున్నది. మార్కసు బాయ్స్ టౌన్ కొత్త పాఠశాలా భవనాన్ని ప్రారంభిస్తూ రాష్ట్ర ముఖ్యమంత్రి వారిని అభినందించి, వారి కార్యదీక్షను గురించి మాట్లాడారు. ఇక్కడ వివిధ మతాల పిల్లలున్నప్పటికీ, యెటువంటి జోక్యమూ లేకుండా యెవరిమత విశ్వాసాల ప్రకారం వారు నడుచుకోడానికవకాశ మున్నదని ఆయన ప్రత్యేకంగా పేర్కొన్నారు. ఈ సంస్థ యిలా మతప్రసక్తిలేని భారతరాజ్యాంగాని కనుగుణంగా నిర్వహించబడ్డం మెచ్చుకొనదగిన విషయమని ఆయన అన్నారు



పొలం పని.

మార్కసుబాయ్స్ టౌన్ నిర్మాణంలో సెయింటుగేబ్రియల్ ఇండియన్ బ్రదర్సుకి వారి ప్రావిన్షియల్ అధికారి రివరెండు బ్రదర్ ఎలియజార్ పూర్తి సహకారం లభించింది. రివరెండు బ్రదర్ జాన్ ఆఫ్ గాడ్ (రెక్టార్ ఆఫ్ ఆల్ సెయింట్సు) వారికి నాయకత్వం వహించారు. ఈ సంస్థ ప్రధాన



పిల్లలుతోటకి నీళ్లుపోస్తున్నారు.

భాగం ఒక అనాథశరణాలయం. ఇది గమీనామీ ఒక శతాబ్దానికి పూర్వం అల్‌సెయింట్సు సంస్థకి జతగా నెలకొల్పబడింది. ఫాదర్ ఫ్లానగన్ బాయ్స్ టౌన్ స్థాపన ప్రారంభించేసరికి ఆయనచేతిలో కేవలం 60 డాలర్లున్నాయి. అలాగే యిక్కడ బ్రదర్స్‌కికూడా సంస్థ ప్రారంభసమయానికి చేతిలో డబ్బు లేదు. విరాళాలకై మత సంబంధంలేని సంస్థలనర్థిస్తే ప్రయోజనం లేకపోయింది.

బ్రిదర్సుకూడా ఫాదర్ ఫ్లానగన్‌లాగే కష్టాలకి వెరవక స్వయం సహాయకునికి భగవంతుడు తోడ్పడుతాడనే నమ్మకంతో తమకిగల స్వల్పమైన ఆధారాలతోనే పని ప్రారంభించారు. తగినంత సొమ్ము యిచ్చి వారికి ఆర్చిబిషప్ తోడ్పడ్డారు. ఆ తరువాత న్యూఢిల్లీలోని కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం ధన సహాయం చేయగా, హైదరాబాదు సాంఘిక సేవాశాఖ మొదటి మూడు బ్లాకులపై కప్పులకి వుచితంగా ఆస్బెస్టాస్ రేకుల్ని యిచ్చింది. బాయ్స్ టౌన్‌కి సలాంఛనంగా ప్రారంభోత్సవం జరిగేనాటికి భోజన సౌకర్యాలకై మూడు బ్లాకులు, ... విద్యకి రెండు బ్లాకులు, సాధారణ విద్య, ... విద్యలకి 6 తాత్కాలిక షెడ్డులు వున్నాయి. ప్రారంభంలో యిక్కడ వున్న 102 మంది పిల్లల్లోను 80 మంది అనాథులు.

ఇప్పుడిక్కడి పిల్లల సంఖ్య 135 కి పెరిగింది. వీరందరికీ అన్న వస్త్రాలు, గృహావసతి యిచ్చి, వుచితంగా విద్యనేర్పించబడుతుంది. ఇదంతా భారతీయ సాంఘిక సేవా మహాసభ, కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం, హైదరాబాదు మునిసిపలు కార్పొరేషన్ల చలువ. అలాగే మోన్సురివరిండు మార్కు గోపు, రివరిండు బ్రదర్ ఫ్రాంక్లిన్ గుల్ల శ్రద్ధఫలితం కూడా. ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యింత స్వల్పకాలంలో యీ సంస్థసాధించిన అభివృద్ధిని మెచ్చుకుంటూ ప్రజలు ముఖ్యంగా ధనికులు దీనికి వుదారంగా విరాళాలివ్వాలని విజ్ఞప్తి చేశారు.

## ఏకకుటుంబం

ఈనాడు మార్కసుబాయ్స్‌టౌన్‌లో జీవకళతొణికిసలాడుతున్నది. ఇక్కడ చేరిన పిల్లలంతా కులమత వివక్షతలేకుండా యేకకుటుంబంలోలా కలిసిమెలిసి పనిచేసి, చదువుకుని, ఆడుకుంటారు. ఫాదర్ ఫ్లానగన్ సంస్థలాగే యిది కూడా "ఇల్లులేని వారికిల్లు, తండ్రిలేనివారికి కుటుంబం". ఇక్కడ 8, 12 సంవత్సరాల మధ్య వయస్కులైన బాలురు చేర్చుకోబడతారు. వారు 18 సంవత్సరాలొచ్చేవరకూ యిక్కడ వుంటారు. ఈకాలంలో వారికి తగిన సాంకేతిక విద్య, వృత్తి విద్య నేర్పబడతాయి. మిషనుకుట్టు, వడ్రంగం, తోటపని, వ్యవసాయం పనులు నేర్పబడతాయి. ముద్రణ, ద్రాక్షతోట పెంపకాలలో శిక్షణకికూడా కొత్తగా యిక్కడ సౌకర్యాలు కల్పించబడినవి.

బాయ్స్‌టౌన్ మూలాశయం పిల్లల్లో మంచి నడవడికను పెంపొందించడం. ఎవరికి వారే క్రమ శిక్ష

ణకిలోబడి నడుచుకోనడం యిక్కడ నేర్పబడుతుంది. ఈ ఆశయసిద్ధికై యీ సంస్థ నిర్వహణ బాధ్యత సెయింటు గేబ్రియల్ ఇండియన్ బ్రదర్స్‌కి అప్పగించబడింది. వారు ఆల్ సెయింట్సు సంస్థను యిక్కడికి ఆరు సంవత్సరాలుగా బహుసమర్థతతో నిర్వహిస్తున్నారు. ఇదికాక, శ్రీ ఎమ్. నర్సింగరావు అధ్యక్షులుగా దీనికొక సలహా సంఘమున్నది. దాని సభ్యుల వివరాలు యివి: శ్రీమతి థాగే, శ్రీమతి దయాదేవి, శ్రీమతి జబ్బార్, శ్రీ మహమ్మద్‌సుల్తాన్, శ్రీ జానకీ ప్రసాద్. రివరెండు బ్రదర్ జాన్ దీని కార్యదర్శి. రివరెండు బ్రదర్ జాన్ ఆవ్ సేక్రెడ్ హార్టుకో శాధికారి. ఈ యసే షాన్ డైరెక్టరు కూడా. రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి, హైదరాబాదు ఆర్చిబిషప్పులు పోషకులు.

డైరెక్టరు శక్త్యుత్సాహాలు గల యువకుడు. ఆయనకి ముగ్గురు బ్రదర్సు, కొందరు మామూలు మనుషులు తోడ్పడుతారు. వీరు యీ సంస్థలోనే వుండి పిల్లల బాధ్యతను వహిస్తారు. ప్రస్తుతం యిక్కడ 7 భాషలకి చెందిన పిల్లలున్నారు. ఇక్కడ సాధారణ భాష జాతీయ భాషయైన హిందీ.

విజయాన్నిమించిన విజయంలేదు. మార్కసు బాయ్స్ టౌన్ నిలకడగా అభివృద్ధి చెందుతున్నది.

"ఒక వృద్ధుణ్ణి రక్షిస్తే ఒక్క మనిషినే రక్షించినట్లు, కాని ఒక పిల్లవాణ్ణి రక్షిస్తే చాలమందిని రక్షించినట్లు" అన్నమాటలో యెంతో నిజమున్నది.




MAP OF
NIZAMABAD DISTRICT (A.P.)
ADILABAD DIST.
GODAVARI RIVER
BAU KONDA
BANOLA
ARMUR.
ARMUR
BODHAN
NIZAMABAD RS
BIMGAL
DICHPALLI RS.
SIRKONDA
RUDR UR
WARN
MOSRA
MANCHAPPA
SIRNAPALLI
SIRNAPALLI RS
NIZAMABAD
JUKAL
BICHKONDA
BANSWADA
BANSWADA
GANDHARI
KAMAREDDI
YELLAREDDY
KAM AREDDI RS.
PITL AM
LINGANPET
YELLAREDDI
NIZAMSAGAR
MEDAK DIST
DIST KARIMNAGAR
REFERENCE
DIST BOUNDARY
TALUK BOUNDARY
NATIONAL HIGHWAY
STATE HIGHWAY
ROAD
RAILWAY LINE METRE GAUGE
RIVER.

# నిజామాబాదు

నిజామాబాదు జిల్లాకి ఉత్తరాన ఆదిలాబాదు, తూర్పున కరీంనగరం, దక్షిణాన మెదక్ జిల్లాలు, పశ్చిమాన, వాయవ్యసరిహద్దున బొంబాయి రాష్ట్ర ప్రదేశమున్నాయి ఈ జిల్లాను బొంబాయి రాష్ట్రం నుంచి గోదావరినది విడదీస్తుంది. ఈ జిల్లా విస్తీర్ణం 3,203 చదరపుమైళ్లు. జనసంఖ్య 8 లక్షల 33 వేలుపైన. దీనిలో రమారమి 7 లక్షల మంది పట్నవాసులు. మిగిలినవారు పల్లెటూరివారు.

నిజామాబాదులో యేటా వెంకటేశ్వరస్వామి ఉత్సవం జరుగుతుంది. అక్కడ ఒకనిర్దిష్టప్రదేశంలో ఒక జెండా ప్రతిష్ఠించబడుతుంది. యాత్రీకులు వచ్చిదానిని సందర్శిస్తారు. ఆ తరువాత దానిని శ్రీ వెంకటేశ్వరస్వామి ప్రధానదేవాలయమున్న తిరుపతికి తీసుకువెళతారు. ఈ వెంకటేశ్వర జెండా సర్కారు జిల్లాల ప్రఖ్యాతివంటిది నిజామాబాదులో జరిగే కంఠేశ్వర జాత్రకూడా ప్రత్యేకంగా పేర్కొనదగినదే. ఈ రెండు ఉత్సవాలకికూడా జిల్లానుంచి, రాష్ట్రం యితర ప్రాంతాలనుంచికూడా చాలమంది యాత్రీకులు వస్తారు.



బోధన్‌లోని పంచదార ఫ్యాక్టరీ.

ఈ జిల్లాలో పెక్కు బియ్యం మిల్లులు, నూనెమిల్లులు వున్నాయి. బోధన్‌లోని నిజాం పంచదారఫ్యాక్టరీ, సారాఫ్యాక్టరీలు ప్రసిద్ధమైనవి పంచదారఫ్యాక్టరీ యేటా 4 లక్షల బస్తాల పంచదారను తయారుచేస్తుంది.

ఈ జిల్లా శీతోష్ణస్థితి సాధారణమైనది.

వర్షపాతం : ఇక్కడ వర్షాలు జూన్, సెప్టెంబరు నెలలమధ్యకురుస్తాయి. సగటు వర్షపాతం 33.8 అం. వర్షాలు జిల్లా అంతటా ఒకేలా కురియవు.

వ్యవసాయం : ఇక్కడ ప్రధానపంట వరి. విత్తనాల్ని పొలంలో ఒకేసారి జల్లుతారు, ముందునారుమళ్లను పెంచి నారును పూడ్చే (నాట్లు) పద్ధతికూడా యిక్కడ అమలులోవుంది. బియ్యం, జొన్న, మొక్కజొన్న, పప్పుదినుసులు యిక్కడపండే ముఖ్య ఆహారపంటలు. ఆముదాలు, వేరుసెనగ, పసుపు, చెఱకులు ప్రధాన వాణిజ్య పంటలు. నిజాంసాగర్ ప్రాజెక్టు ఈ జిల్లాలో బన్సవాడ, బోధన్, నిజామాబాదు, ఆర్మూరు తాలుకాలకి వుపకరిస్తున్నది. పెద్దకాలవ పొడుగు 93 మైళ్లు. పిల్లకాలవలనిడివి యించుమించు 1000 మైళ్లు. ఇక్కడ వలలా అల్లుకున్న నీటిపారుదల సిస్టంవున్నది.

జానాభా : ఈ జిల్లాలో 100 కి 70 మంది వ్యవసాయంపై జీవిస్తారు. 4.6 శాతం వాణిజ్యంపైనా, 9.6 శాతంరవాణాపైనా జీవిస్తారు. ఇక్కడ గ్రామలేక కుటీరపరిశ్రమలు చాలా తక్కువ. లింగంపేట యిత్తడిసామాను, ఆర్మూరు రేపటు వస్త్రాలు రాష్ట్రంలో ప్రసిద్ధిబడసాయి. ఇక్కడ పసుపు చాలా భారీయెత్తున పండించబడుతుంది. నిజామాబాదు రాష్ట్రంలో మిక్కిలి యెక్కువ పసుపు పండించే జిల్లా అని చెప్పవచ్చు. రాష్ట్రంలో రంగులతయారీవంటి రసాయన



నిజాంసాగర్ సరస్సు



నిజాంసాగర్ జల-విద్యుచ్ఛక్తి ప్రాజెక్టు

పరిశ్రమ అవసరాల దృష్ట్యా దీనిపైపరిశోధనలు జరిపితే లాభించవచ్చు.

నిజామాబాదు, కామారెడ్డిలలో చెరి ఒకటి చొప్పున యిక్కడ రెండు క్రమబద్ధమైన మార్కెట్లు న్నాయి. ఈ జిల్లానుంచి కరీంనగరం, ఆదిలాబాదు, నాందేడు, హైదరాబాదు జిల్లాలకి బస్సులు నడుస్తాయి. ఇంచుమించు 52 బస్సు మార్గాలు యీ జిల్లాను రాష్ట్రంవివిధ ప్రాంతాలతోను, బొంబాయితోను కలుపుతాయి. నిజాంసాగర్ అభివృద్ధిపథకం క్రింద యీ జిల్లాలోని చాల గ్రామాలు ఒకదానితోఒకటి చక్కని రోడ్లద్వారా కలుపబడినవి. నిజామాబాదు జిల్లా అడవులు ప్రసిద్ధమైనవి. ఒక్క కామారెడ్డి తాలూకా తప్ప జిల్లాలో మిగిలిన తాలూకాలన్ని నిజాంసాగర్ పోచారం ప్రాజెక్టులకాలువలద్వారా కలుపబడినవి.

ఈ జిల్లా తాలూకాల పేర్లుయివి :

1. నిజామాబాదు, కామారెడ్డి, ఎల్లారెడ్డి, బన్సవాడ, బోధన్, ఆర్మూరు.

బోధన్, కామారెడ్డి, నిజామాబాద్ పట్నాలు రైలు మార్గం ద్వారా కలుపబడ్డాయి. పూర్వ హైదరాబాదు రాష్ట్రం మారాట్వాడా ప్రాంతంలో ఒక భాగమైన జుక్కల్, బిచ్కుండ మండలాలు, రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ సందర్భంలో బన్సవాడ తాలూకాలో చేర్చబడినవి.

1951 లెక్కల ప్రకారం యీ జిల్లాలో 926 గ్రామాలున్నాయి. 188 తపాలాఫీసులు, 17 పోలీసుస్టేషన్లువున్నాయి.

ప్రియూనివర్సిటీ కోర్సు పథకం క్రింద నిజామాబాద్ లో ఒక ఆర్ట్సు, సైన్సు కాలేజీ- గిరాజ్ కాలేజీ- ప్రారంభింపబడింది.

| పట్టణాలజనసంఖ్య | మునిసిపాలిటి | టౌన్ కమిటి |
|---|---|---|
| నిజామాబాదు | 55,195 | — |
| బోధన్ | 22,49 | — |
| ఆర్మూరు | | 11,680 |
| ఏడ్ పల్లి | | 8,095 |

| | |
|---|---|
| కామారెడ్డి | 7,829 |
| బన్సువాడ | 6,816 |
| బాల్కొండ | 5,779 |
| డోమ్కొండ | 5,339 |
| రంజాల్ | 5,355 |
| ఎల్లారెడ్డి | 4,783 |
| బిచ్కుంద | 4,450 |
| జుక్కల్ | 3,223 |

జిల్లా ముఖ్యపట్నం నిజామాబాదు.



# తిరువూరు తాలూకా ప్రగతి

**కృష్ణాజిల్లా తిరువూరు తాలూకా జిల్లా వుత్తర భాగాన గల మెట్టతాలూకా. దీనికి రెండు వెంపుల తెలంగాణా ప్రాంతము, మిగిలిన రెండు వెంపులా విజయవాడ, నూజవీడు, చింతలపూడి తాలూకాలు వున్నాయి.**

**పూర్వం ఒక్క నాలుగు గ్రామాలు తప్ప మిగిలిన తాలూకాఅంతా జమీందారీ ప్రాంతంగా వుండేది. ఇప్పుడిది జమీందారీల రద్దు చట్టం క్రింద ప్రభుత్వవశం చేసుకొనబడింది.**

**ఇంతకుముందు ఈ ప్రాంతంలో గ్రామ సంక్షేమ పథకం అమలుజరిగేది. ఈ కార్యక్రమం ముఖ్య కార్యాలయం విస్సన్న పేటలో వుండేది 4-4-1956 నుంచి యీ తాలూకా జాతీయ వికాస సేవాకేంద్రంగా మార్చబడింది. 1-4-56 నుంచి ఆ జాతీయ వికాస సేవాకేంద్రం సమాజాభివృద్ధి కేంద్రంగా మార్చబడింది.**

ఈ కేంద్రంలో మొత్తంతిరువూరు తాలూకాలో గల 92 గ్రామాలు, 75 శివార్లు చేరివున్నాయి. ఈ కేంద్రం జనాభా దాదాపు లక్షా 27 వేలు. విస్తీర్ణం 465 చ. మైళ్లు. ఇక్కడ యించుమించు 23,980 కుటుంబాలున్నాయి.

తెలంగాణా సరిహద్దులో వున్న ఈ మెట్ట తాలూకా అనేక విషయాలలో చాలా వెనకబడి ఉంది.

## వ్యవసాయాభివృద్ధి

ఇక్కడ ప్రధానంగా వరి, (35,000యె) జొన్న (70,000యె.) పంటలు పండించబడతాయి. గ్రామీణుల ముఖ్యవృత్తి వ్యవసాయం. ఇక్కడ ఎర్రనేలలు, ఇసుక బంకమట్టి నేలలు వున్నాయి. వరి ముఖ్యంగా సాగునీటి చెరువులక్రింద పండుతుంది. మాగాణీ భూములు కొంచం చౌడు ప్రదేశాలు.

ఇక్కడ సాగు లాయకైన బంజరుభూమి చాలా వుంది. అక్కడ పళ్లతోటల్ని పెంచడానికి చక్కని అవకాశాలున్నాయి. భూమి యెగుడు దిగుడుగా యేటవాలుగా వున్నందున భూసారం విపరీతంగా కొట్టుకుని పోయే ప్రమాదమున్నది.

అభివృద్ధి కేంద్రం యేర్పాటైనతరువాత 15,412 యెకరాలు బాగై సాగుక్రిందికి వచ్చాయి. ప్రైవేటు బావుల్ని యెక్కువగా త్రవ్వి, నూనె ఇంజన్లు, విద్యుచ్ఛక్తి మోటార్లను నెలకొల్పి సాగునీటి సౌకర్యాలు అభివృద్ధి పరచబడినవి. అందువల్ల అదనంగా మరి 3000 యెకరాలలో వరి పండింది. దానితో సాలీనా దగ్గరగా 2౼౦ టన్నుల ధాన్యం యెక్కువ పండాయి. అ పైన వెంట యెరువు తయారీ, పచ్చియెరువు వాడకం, సరైన మోతాదులలో రసాయన యెరువుల వాడకం, జపాను పద్ధతి వరిసాగు, చీడలు, వ్యాధులనివారణ వంటి వుత్తమ వ్యవసాయ పద్ధతుల్ని అవలంబించినందువల్ల యెకరావుత్పత్తి 24 మణుగులనుంచి

30 మణుగులికి హెచ్చింది. ఈ విధంగా సాలీనా యించుమించు 700 టన్నుల ధాన్యం యెక్కువ పండుతున్నాయి.

ఈ కేంద్రంలో ఉపయోగిస్తున్న వరి రకాలు యివి: ఎమ్. టి. యు. 7, ఎమ్ టి యు 8 ఎమ్. టి. యు. 19, ఎమ్. టి యు 3 ఇప్పుడు ఎస్. ఎల్. 018 ఎక్కువ ప్రదేశంలో వేయబడు తున్నది. ఇది చౌడుభూమికి తగివున్నందున ఈ తాలూకాలో దీనిని వాడాలని బోధించబడు తున్నది. ఏటా వుత్తమమైన వరి విత్తనాలు పంచ బడుతున్నవి. ప్రతి 3-5 సంవత్సరాల కొకసారి రకం మార్చబడుతున్నది.

1957 లో సమాజాభివృద్ధి కేంద్రంలో వరి విత్తనాల వుత్పత్తికి 10 యె., జొన్న విత్తనాల వుత్పత్తికి 5 యెకరాల భూమిని ప్రభుత్వ వ్యవసాయ శాఖ యేర్పాటుచేసింది. అభివృద్ధి కేంద్రంలో పంపిణీకవసరమైన ప్రాథమిక విత్తనాలు యిక్కడ వుత్పత్తి చేయబడుతున్నాయి. ఇవీ గాక యించుమించు 50 యెకరాల విస్తీర్ణంగల సెకండరీ విత్తనాల వుత్పత్తి క్షేత్రాలు కూడా నడపబడు తున్నాయి. ఇక్కడ వుత్పత్తి అయే విత్తనాలు కేంద్రంలోని వివిధ రైతులకి పంచబడుతున్నాయి.

కేంద్రంలోని వివిధ గ్రామాలలో 13 వ్యవసాయ నమూనాక్షేత్రాలు యేర్పాటు చేయబడినవి. ఈ క్షేత్రాలలో వరి ఉత్పత్తి 14 బస్తాల నుంచి 29 బస్తాలకి, వేరుసెనగ పంట 5 నుంచి 14 బస్తాలకి, మిర్చి పంట 2 నుంచి 4 క్యాండీలకి హెచ్చింది. అంటే మామూలు రైతుకంటె నమూనాక్షేత్రం రైతు రెట్టింపు పంటని పండించే డన్నమాట.

## బహుమతులు

అధికోత్పత్తిలో రైతులను ప్రోత్సహించుటకై 1955-56, 1956-57, 1957-58 లలో 12 గ్రామాలలో వరిపంటలో గ్రామస్థాయి పోటీలు యేర్పాటుచేసి, యెక్కువ పండించినవారికి బహుమతులు ఇవ్వబడినవి. నరసాపురం గ్రామస్థుడు శ్రీ తుమ్మా రాఘవులు యెకరానికి 6,997 పౌ. పండించి ప్రథమ బహుమతి నందుకున్నారు. 1957 వనమహోత్సవ సమయంలో అందరికంటె యెక్కువచెట్లను నాటి, వాటిని జాగ్రత్తగా పెంచినందుకై పోలవరం గ్రామస్థుడు శ్రీ చట్రాతి లక్ష్మీకాంతరావుకి జిల్లాకలక్టరు విచక్షణా గ్రాంట్లనుంచి బహుమతి వచ్చింది. ఆయన యించుమించు 12,000 మొక్కల్ని నాటారు. అవి వివిధ రకాలకు చెందినవి ఆర్థికంగా విలువగలవి. ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని అవలంబించి యెక్కువ ధాన్యం పండించినదుకు శ్రీ బి. సూర్యనారాయణ (లక్ష్మీపురం) శ్రీ కె. రంగస్వామిరావు (పుల్లేల) లకి కూడా బహుమతులు యివ్వబడినవి. రాష్ట్ర వ్యవసాయశాఖ మంత్రి శ్రీ పి. తిమ్మారెడ్డి యీ అభివృద్ధి కేంద్రాన్ని సందర్శించినప్పుడు 10-3-58 న యీ బహుమతుల్ని పంచిపెట్టారు.

భూసార పరిరక్షణ చర్యల్ని ప్రదర్శించి, రైతులకి చూపుటకై ప్రభుత్వం రూ. 18,000 మంజూరు చేసింది. గంపలగూడెంలో 150 యెకరాలలో ప్లాట్లు వేయబడినవి.

ఈ ప్రదర్శన ఫలితంగా 3,500 యె. గల రైతులు భూసార పరిరక్షణ చర్యల్ని అవలంబించేరు.

వ్యవసాయరంగంలో జరిగిన ముఖ్యమైన యితర పనుల వివరాలు యివి.

| | | |
|---|---|---|
| 1. నూనెపిట్టులతో సహా పంచబడిన రసాయనయెరువులు | | 1,03,438 మణుగులు |
| 2. ఏర్పాటు చేయబడిన ప్రదర్శన ప్లాట్లు | (సంఖ్య) | 36,923 |
| 3. పంచిన పళ్ళమొక్కలు | (సంఖ్య) | 86,718 |
| 4. పళ్ళతోటలక్రింది భూమి విస్తీర్ణం | (యెకరాలు) | 4,665-84 |

5. కూరగాయల క్రింది భూమి విస్తీర్ణం „ 4,536-18

6. పచ్చి యెరువుల క్రింది భూమి విస్తీర్ణం „ 16,873-50

7. జపాను పద్ధతి వరిసాగు క్రింది భూమి విస్తీర్ణం „ 15,100

8. సాగునీటి సరఫరా క్రింద పంచిన అప్పులు (రూ॥) 3,13,680

9. తీవ్ర యెరువు వాడకం పథకం క్రింద పంచిన అప్పులు „ 1,70,000

10. పళ్ల అభివృద్ధి క్రింద పంచిన అప్పులు „ 15,000

## పశుపోషణ

జాతీయ వికాససేవా కేంద్ర ప్రారంభానికి పూర్వం తాలూకా మొత్తానికి తిరువూరులో ఒక చిన్న పశువైద్య డిస్పెన్సరీ మాత్రంవుండేది. జాతీయ వికాస సేవా పథకం క్రింద కేంద్రంలోని వేర్వేరు ప్రాంతాలలో 5 పశువుల ప్రథమ చికిత్సా కేంద్రాలు నెలకొల్పబడ్డాయి. ప్రస్తుతం నాలుగు కేంద్రాలు పనిచేస్తున్నాయి. పశువైద్య సహాయశస్త్రి చికిత్సకుడు, పశుపోషణ విస్తరణాధికార్లు వారానికొకసారి యీ కేంద్రాలకివచ్చి పశువులకి చికిత్స చేస్తారు. ఈ అభివృద్ధి కేంద్ర ప్రాంతాన్ని చెరిసగం చేసి పై అధికారులిద్దరికీ చెరోభాగం అప్పగించబడింది.

ఈ అభివృద్ధి కేంద్రంలో, దాని ధనసహాయంతో, 4 ప్రైవేటు కోళ్ల పరిశ్రమ యూనిట్లు నడుస్తున్నాయి.

సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద 1957 జూలైలో తిరువూరులో ఒక కృత్రిమ పిండోత్పత్తి కేంద్రం, ఒక గుడ్లు (కోడి) పొదిగే కేంద్రం ప్రారంభింపబడినవి.

అభివృద్ధి కేంద్రం ప్రారంభానికి పూర్వం అక్కడ మంచి ఆంబోతులు ఆట్టేవుండేవి కావు. ఈ కేంద్రం ప్రారంభించిన తరువాత గ్రామీణులకి 27 ఆంబోతులు సరఫరా చేయబడినవి. కొండూరు, చిన్నంపేట గ్రామాలకి బళ్లారి పొట్టేళ్లుకూడా సరఫరా చేయబడినవి.

ఇది కాక తెల్లదేవరపల్లిలో ఒక కృత్రిమపిండోత్పత్తి వుపకేంద్రం నెలకొల్పబడింది. ఈ కేంద్రం వ్యవహారాలు చూడ్డానికి ఒక వెటర్నరీ కాంపౌండరు నియమించబడ్డాడు. తెల్లదేవరపల్లి గ్రామస్థులు కృత్రిమపిండోత్పత్తి కేంద్రానికి ఒక ఒంగోలు యెద్దుని (రూ 1900) ఒక ముర్రా బఱ్ఱెని (రూ 900) విరాళంగా యిచ్చారు. తమ గ్రామంలో చిన్నరకం పశువైద్య డిస్పెన్సరీ నిమిత్తం వారిప్పుడు రూ. 7,000/- విలువచేసే ఒక భవనాన్ని నిర్మిస్తున్నారు.

31-3-58 వరకూ పశు సంపద అభివృద్ధికై జరిగిన ముఖ్యమైన యితర చర్యల వివరాలు యివి :-

| | | |
|---|---|---|
| 1. | చికిత్సచేసిన పశువులు | 17,367 |
| 2. | టీకాలువేసిన పశువులు, కోళ్లు | 1,88,553 |
| 3. | విత్తుకొట్టిన పశువులు | 3,821 |
| 4. | సరఫరా అయిన పోతు పశులు | 1,450 |
| 5. | సరఫరా అయిన వుత్తమ జాతిగుడ్లు | 8,428 |

## పారిశ్రామికాభివృద్ధి

అభివృద్ధి కేంద్ర ప్రారంభానికి ముందు అక్కడ వుత్పత్తి—శిక్షణా కేంద్రాలు లేవు. ప్రస్తుతం దిగువ 4. ఉత్పత్తి-శిక్షణా కేంద్రాలు వున్నాయి :

1. పీచు పరిశ్రమ : తాటిపీచు తయారీ, వుపయోగాల ప్రచారం నిమిత్తం ఒక తాటిపీచు పరిశ్రమ ప్రచార యూనిట్టు ప్రారంభింప బడింది. ఇది పోలవరం, చిన్నంపేటలలో నడుపబడేది. బోధకుడులేక దాన్ని కొన్నాళ్లు మూసివేయవలసి వచ్చినది. మళ్లీ యిప్పుడది తుమ్మగూడెంలో ప్రారంభించబడింది.

2. కమ్మరవృత్తి : ఊటుకూరు గ్రామంలో 16 కమ్మరికుటుంబాలున్నాయి. వాటి సౌకర్యార్థం అక్కడ ఒక కేంద్రం నెలకొల్పబడింది. దానిలో కమ్మరిపనికి సంబంధించిన పరికరాలు రూ. 2,562-44 విలువగలవివున్నాయి. ఇనుము, వుక్కు కొనుగోలుకై కమ్మర్లకి పెట్టుబడి పెట్టబడుతుంది. వారు కత్తులు, కొడవళ్లు, నాగళ్లు మున్నగు వ్యవసాయ పరికరాల్నికూడా తయారుచేస్తారు. అవి మార్కెటులో అమ్మబడతాయి. ఈ అమ్మకాలవల్ల వచ్చిన సొమ్ములోనుంచి యినుము, లేక వుక్కు ఖరీదు తీసుకోబడుతుంది. ఈ విధంగా కమ్మర్లకి ముడిపదార్థాలు, ఆధునిక పరికరాలకి సౌకర్యాలు కల్పించబడినవి. ఈ కేంద్రంలో వుత్పత్తిఅయి, అమ్మకమయిన సరుకు వివరాలు యివి :

| | | |
|---|---|---|
| మొత్తం వుత్పత్తి | ... | రూ. 1,424-68 |
| మొత్తం అమ్మకం | ... | ,, 1,220-08 |

3. దుస్తుల తయారీ : గంపలగూడెంలో స్త్రీల దుస్తుల తయారీ కేంద్రమొకటి ప్రారంభింపబడింది. ఇక్కడ స్త్రీలకి కుట్టుపని నేర్పి, దానిలో శిక్షణ యివ్వబడుతుంది. ఇంతవరకూ యిక్కడ 32 మంది స్త్రీలు శిక్షణపొందేరు. ఈ కేంద్రం యిప్పుడు తిరువూరికి తరలించబడింది. అక్కడ అది 1958 ఫిబ్రవరి ఆఖరినుంచి పనిచేస్తున్నది.

4. చర్మకార పరిశ్రమ : గంపలగూడెం హరిజనుల సౌకర్యార్థం సహకార పద్ధతిలో ఒక తోలు పదును కేంద్రం ప్రారంభింపబడింది. 37 మంది సభ్యులు సహకార కుటీర పరిశ్రమ సంఘంగా యేర్పడ్డారు. దాని వాటా మూలధనం రూ. 420. ఈ కేంద్రం యిటీవలే ప్రారంభింపబడింది.

ఇదికాక, తిరువూరులో, తిరువూరులోని ఆంధ్ర సర్వోదయ సంఘంచే దంపుడుబియ్యం తయారీకై ఒక పారిశ్రామిక కేంద్రం ప్రారంభింపబడింది. ఈ సంఘానికి రాష్ట్ర ప్రభుత్వం 1955 లో వడ్డీ లేకుండా రూ. 10,000 అప్పు యిచ్చింది. ఈ కేంద్రంలో 20 మంది స్త్రీలకి పని చూపించి 200 కుటుంబాలకి దంపుడుబియ్యం అందజేయాలని సంకల్పం.

అభివృద్ధి కేంద్రం ప్రారంభానికి ముందు అక్కడ విద్యుచ్ఛక్తి లేదు. ఇప్పుడు తిరువూరు, గంపలగూడెం, విన్నగడవ, కంభంపాడు గ్రామాలకి వీధి దీపాలకి, వ్యవసాయ ప్రయోజనాలకీ, పెక్కు యితర గ్రామాలకి వ్యవసాయ ప్రయోజనాలకి విద్యుచ్ఛక్తి లభింపజేయబడుతున్నది. ఇంచుమించు 50 మంది రైతులు పొలాలకి నీరు పెట్టుకోడానికై విద్యుచ్ఛక్తిని వుపయోగిస్తున్నారు.

### రాకపోకల సౌకర్యాలు

రాకపోకల సౌకర్యాలు, రవాణా సౌకర్యాల విషయంలో ఈ కేంద్రం చాలా వెనకపడి వుంది. తిరువూరు నుంచి విజయవాడ, నూజవీడు, మధిరలకు మూడేమూడు ప్రధాన రోడ్లున్నాయి. ఈ మూడు రోడ్లమీద వున్న గ్రామాలని తప్ప మిగిలిన వాటిని వర్షాకాలంలో చేరడం బహుకష్టం.

ఇక్కడ చాలా వాగులు ప్రవహిస్తున్నందున వాటిని దాటి ఒక చోటనుంచి మరొక చోటికి వెళ్లడం, సరుకుని రవాణా చేయడం కుదరదు. అవి కొన్ని గ్రామాల మధ్యనే ప్రవహించి రవాణాని కష్టతరంచేస్తాయి.

అభివృద్ధి కేంద్రం ప్రారంభింపబడినపిమ్మట గ్రామరస్తాలు బాగా నిర్మించబడ్డాయి. ఈ విషయంలో గ్రామీణులు అత్యుత్సాహంతో ముందుకు వచ్చి పని చేశారు. 29 గ్రామాలలో 'అప్రోచ్' రోడ్లు నిర్మించబడ్డాయి. ఇందుకు మొత్తం రూ. 74,782 ఖర్చయింది. ఇందులో రూ. 26,148 ప్రజలు భరించారు,

అభివృద్ధి కేంద్రంలో 26 వంతెనలు నిర్మించబడినవి. అభివృద్ధి కేంద్రం కాలంలో కృష్ణాజిల్లా బోర్డుచే నర్సాపురం నుంచి పోలవరం వరకూ యించుమించు 10 మై. నిడివిగల రోడ్డు నిర్మించబడింది.

## సహకారం, పంచాయతీలు

అభివృద్ధి కేంద్రంలో 71 బహుళార్థ సాధక సహకార సంఘాలు, 6 ప్రత్యేక రకం సహకార సంఘాలు పనిచేస్తున్నాయి. అభివృద్ధి కేంద్రం కాలంలో దిగువ సంఘాలు యేర్పాటైనవి.

1. గంపలగూడెంలో మార్కెటింగు సొసైటీ.
2. నేమలిలో బహుళార్థ సాధక సహకార సంఘం.
3. విస్సన్నపేటలో సహకార గృహవసతి సంఘం.
4. కొమిరలో సహకార గృహవసతి సంఘం
5. గంపలగూడెంలో పాదరక్షల పారిశ్రామికుల సహకార సంఘం.

అభివృద్ధి కేంద్రంలోని అన్ని గ్రామాలకి సహకార సంఘాలు వుపకరిస్తున్నవి.

ఈ కేంద్ర ప్రారంభానికి ముందు అక్కడ 14 పంచాయతీలు మాత్రమే వుండేవి. ఇప్పుడు అక్కడ 76 పంచాయతీలు పనిచేస్తున్నవి.

## విద్య

అభివృద్ధి కేంద్ర ప్రారంభానికి ముందు అక్కడ 148 ప్రాథమిక పాఠశాలలు వుండేవి. వాటిలో 430 మంది ఉపాధ్యాయులు పనిచేసేవారు. ఇప్పుడు పాఠశాలల సంఖ్య 180 కి, ఉపాధ్యాయుల సంఖ్య 440 కి పెరిగింది. వాటిలో 5 పాఠశాలల్ని సమాజాభివృద్ధి కేంద్రం నడుపుతున్నది.

గుళ్లపూడి, తెల్లదేవరపల్లి, ఊటుకూరు, కోటిపల్లి, కొండపర్వ, రేపూడి గ్రామాలలో సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద ప్రాథమిక పాఠశాలా భవనాలు నిర్మించబడినవి.

తిరువూరు, గంపలగూడెం, విస్సన్నపేటలలో మొత్తం 3 ఉన్నత పాఠశాలలున్నాయి. తిరువూరులో వృత్తివిద్యా [illegible] పాఠశాల, కంభంపాడులో [illegible] ఉన్నాయి. గంపలగూడెం, విస్సన్నపేటలలోని ఉన్నత పాఠశాలా భవనాలు, కంభంపాడులోని మాధ్యమిక పాఠశాలా భవనం స్థానికాభివృద్ధి కార్యక్రమం క్రింద నిర్మించబడినవి.

## సాంఘిక విద్య

అభివృద్ధి కేంద్రం ప్రస్తుతం 10 గ్రామాలలో వయోజన విద్యా కేంద్రాల్ని నడుపుతున్నది. మొత్తం 52 గ్రామాలలో వయోజన విద్యా కేంద్రాలు నడుపబడ్డాయి. 31-3-58 నాటికి యించుమించు 2,500 మంది అక్షరాస్యులయ్యారు.

17 గ్రామనాయకుల శిక్షణా శిబిరాలు నడుపబడ్డాయి. వీటిలో 11 సర్వవిషయ శిక్షణా శిబిరాలు, 6 ప్రత్యేకవిషయ శిక్షణాశిబిరాలు. ఈ ఆరింటిలోను 4 వ్యవసాయంపైన, 1 విద్యపైన 1 రాకపోకల సౌకర్యాలపైన నడుపబడ్డాయి. ఈ శిబిరాలలో 104 మంది స్త్రీలతో సహా మొత్తం 712 మంది గ్రామనాయకులు శిక్షణపొందారు.

జాతీయ విస్తరణ సేవా కేంద్రం కాలంలో 52 వినోద కాలక్షేప కేంద్రాలు ప్రారంభింప బడినవి. సమాజాభివృద్ధి కేంద్రం కాలంలో 21 కేంద్రాలకి ఆటవస్తువులు సరఫరా చేయబడ్డాయి. 18 భజన మండలులకి భజనవస్తువులు యివ్వబడ్డాయి.

అభివృద్ధి కేంద్రంలో 32 గ్రంథాలయాలు ప్రారంభింపబడ్డాయి. వీటిలో 19 గ్రంథాలయాలకి పుస్తకాలు సరఫరా చేయబడినవి. వీటికి, మిగిలిన వాటికి పుస్తకాలు సర్క్యులేషన్ ప్రాతిపదికపై అందజేయబడుతున్నాయి. ప్రస్తుతం 950పుస్తకాలు సర్క్యులేషన్‌లో వున్నాయి.

తిరువూరు, వూటుకూరు, పెనుగొలను, కొమిర, గంపలగూడెంలలో పిల్లల పార్కులు వున్నాయి. వీటికై రూ. 2,066.50 ఖర్చు పెట్టబడింది. దీనిలో రూ. 657.50 ప్రజలు యిచ్చారు.

31-3-58 నాటికి అభివృద్ధి కేంద్రంలో 12 [illegible]

18 గ్రామాలకి రేడియోలు సరఫరా అయినవి. ఈ సందర్భంలో ఒక్కొక్క దానికి రూ. 150/- చొప్పున అభివృద్ధి కేంద్రం నిధుల నుంచి యివ్వ బడినవి. రూ. 4,590/- ప్రజలు యిచ్చారు.

## స్త్రీ సంక్షేమం

స్త్రీల వినోద కాలక్షేపానికై 12 కేంద్రాలు న్నాయి. వీటికి ఆటవస్తువులు, పుస్తకాలు సరఫరా చేయబడతాయి.

తిరువూరు మిషను కుట్టు కేంద్రంలో స్త్రీలకి మిషనుకుట్టు, రంగుదారాలకుట్టు వగైరా నేర్పడానికి అర్హతపొందిన బోధకురాలు వున్నది. ఈ కేంద్రానికి రెండు కుట్టుమిషన్లు, రంగుదారాల కుట్టు పరికరాలు సరఫరా చేయబడతాయి.

చిట్టేలలో ప్రత్యేకం స్త్రీలకై ఒక ప్రయోజన విద్యా కేంద్రం నడుస్తున్నది.

అభివృద్ధి కేంద్రంలో స్థాపించబడిన 4 కుట్టు పని కేంద్రాల్ని నడుపుటకై బోధకురాళ్లు నియమితులైనారు.

అభివృద్ధి కేంద్రంలో ప్రస్తుతం 8 ప్రసూతి కేంద్రాలున్నాయి. వీటిలో 4అభివృద్ధి కేంద్రసొమ్ముతో ప్రారంభింపబడి నడుపబడుతున్నవి.

గంపలగూడెంలో ప్రత్యేకంగా స్త్రీల నిమిత్తం గ్రామనాయకుల శిక్షణాశిబిరం యేర్పాటు చేయబడింది. దీనికి 44 మంది స్త్రీలు హాజరయ్యారు.

స్త్రీ సంక్షేమ శాఖ గంపలగూడెం, విస్సన్నపేటలలో రెండు స్త్రీ సంక్షేమ కేంద్రాలను నడుపుతున్నది.

## ఆరోగ్యం

అభివృద్ధి కేంద్ర ప్రారంభానికి పూర్వం అక్కడ తిరువూరు, విస్సన్నపేటలలో రెండు లోకల్ ఫండు డిస్పెన్సరీలు, యితర గ్రామాలలో 11 గ్రామీణ డిస్పెన్సరీలు మాత్రమే ఉండేవి.

జాతీయ విస్తరణ సేవాకేంద్రం ప్రారంభమయాక, తిరువూరు డిస్పెన్సరీ ప్రాథమిక ఆరోగ్యకేంద్రంగా అభివృద్ధిపరచబడింది. దీనికి 3 వుప కేంద్రాలు అనుబంధింపబడినవి.

సమాజాభివృద్ధి కార్యక్రమం క్రింద తెల్లదేవరపల్లిలో మరొక ప్రాథమిక ఆరోగ్యకేంద్రం ప్రారంభింపబడింది. అభివృద్ధి కేంద్రం సొమ్మునుంచి 4 ప్రసూతి కేంద్రాలు నడుపబడుతున్నాయి.

ఈ విషయంలో సాధించిన ముఖ్యమైన యితర పనులు యివి :

| | | |
|---|---|---|
| 1. | నిర్మించిన మంచినీటి బావులు | 60 |
| 2. | బాగుచేసిన మంచినీటి బావులు | 330 |
| 3. | పొగరాని పొయ్యిలు | 1,487 |
| 4. | నిర్మించిన ప్రైవేటు మరుగు దొడ్లు | 2,135 |



# స్థానిక సంస్థల యాజమాన్యంలో

మునిసిపాలిటీలు, కొన్ని పట్టణ పంచాయతీల రాబడి మార్గాలను హెచ్చించి, ప్రజలకి మరికొన్ని పౌరసౌకర్యాల్ని కలిగించుటకై ద్వితీయ పంచ వర్ష ప్రణాళికలో రూ. 47.54 లక్షలు కేటాయించ బడినవి. ఈ సొమ్ము మున్సిపాలిటీలకి, పంచాయ తీలకి దీర్ఘకాలిక ఋణాలుగా యివ్వబడుతుంది. 1956-57 లో ఆలమూరు పంచాయతీకి, మార్కెట్ షెడ్డుల నిర్మాణానికై రూ. 0.20 లక్షల అప్పు యివ్వబడింది. 1957-58లో రూ. 9.56 లక్షలు కేటాయించబడినవి. కాని ప్రభుత్వం, 7 మార్కెట్లు, 5 బండి, బస్సు, లారీ స్టాండులు, 1 భవనం, 3 కసాయిశాలలు, 6 రోడ్ల నిర్మాణం లేక మరమ్మతుకై రూ. 6.74 లక్షల్ని మాత్రమే మంజూరుచేసింది.

## పెంటయెరువు తయారీ

పట్టణాలలోని చెత్త చెదారాన్ని పెంటయెరువు తయారీకి ఉపయోగిస్తే అటు పారిశుద్ధ్యము సిద్ధి స్తుంది. దాని వాడకంవల్ల యిటు పంట హెచ్చు తుంది. ఎకరం నేలకి 5 టన్నుల పట్టణ పెంట యెరువు చాలునని, వాడిన ప్రతి టన్ను పెంట యెరువుకి 0.025 టన్నుల బియ్యం అదనంగా పండుతాయని అంచనా.

మెట్ట జిల్లాల్లో పొలాలకి పెంటయెరువును బాగా వాడతారు. ఇప్పుడిప్పుడు కోస్తా ప్రాంతాలలో కూడా దాన్ని వాడుతున్నారు. ప్రస్తుతం ఆంధ్ర ప్రాంతంలో 39 మునిసిపాలిటీలు, 171 పంచాయతీలు, మొత్తం 210 స్థానిక సంస్థలును, తెలంగాణా ప్రాంతంలో 84 స్థానిక సంస్థలును పట్టణ పెంట యెరువును తయారు చేస్తున్నాయి.

పెంటయెరువు దొడ్లను, ట్రెయిలర్లుగల ట్రాక్టర్లు మున్నగువాటిని కొనుటకు ద్వితీయ పంచవర్ష ప్రణాళికలో స్థానిక సంస్థలకి అప్పులు యిచ్చుటకై రూ. 10 లక్షలు కేటాయించబడినవి. 1956-57లో రూ.2,01,500/-, 1957-58 లో రూ. 2,68,500/-. ఆంధ్ర ప్రాంతంలో వరుసగా 10, 18 స్థానిక సంస్థలకి మంజూరు చేయబడినవి. పై కాలంలో తెలంగాణా ప్రాంతానికి అప్పులు యిచ్చుటకు సొమ్ము కేటాయించబడలేదు. 1958-59 కి మాత్రం మొత్తం ఆంధ్రప్రదేశ్ కి రూ. 3 లక్షలు కేటాయించబడ్డాయి. ఇవి ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో 2:1 నిష్పత్తిలో ఖర్చు పెట్టబడతాయి.

1957-58 లో తెలంగాణాకి ప్రభుత్వం రూ. 12,000 సబ్సిడీగా మంజూరు చేసింది. ఇందులో కేంద్ర ప్రభుత్వం వాటా రూ. 5,022. పై మొత్తంలో రూ. 9,480 సబ్సిడీగా ఖర్చుపెట్ట బడింది.

పెంటయెరువు తయారీ పథకం క్రింద సాధించిన ఫలితాల వివరాలు యివి :

| సంవత్సరం | ఆంధ్ర | తెలంగాణా | మొత్తం |
|---|---|---|---|
| | (టన్నులు) | (టన్నులు) | (టన్నులు) |
| 1. 1956-57 | 90,000 | 96,348 | 1,86,348 |
| 2. 1957-58 | 49,261 | 79,822 | 1,28,083 |

1957-58 అంకెలు 1958 ఫిబ్రవరి నెలాఖరివరకూ చేరిన నివేదికల ఆధారంతో తయారు చేయబడినవి.

# ద్వితీయ ప్రణాళిక లక్ష్యాలు

ఆర్థిక వ్యవస్థ స్థిరంగా వుండి, దేశం అభివృద్ధి చెందుటకు కార్మికులు ముఖ్య కారణం. కాబట్టి జాతీయాభివృద్ధికి వుద్దేశించిన ఏ కార్యక్రమంలో నైనా వారికి అధిక ప్రాధాన్యాన్నివ్వాలి. ప్రణాళికా లక్ష్యాల సిద్ధికేమి, సాధారణ ఆర్థికవ్యవస్థ అభివృద్ధికేమి కార్మికులు ముఖ్యసాధనం. వారు బలారోగ్యాలతో వర్థిల్లుటకు పథకనిర్మాతలు వారికి కేవలం అన్నవస్త్రాలు, గృహవసతిలకి సౌకర్యం కలిపించాలదు. వారి సాంఘిక, ఆర్థిక పరిస్థితుల అభివృద్ధి విషయంలోకూడా శ్రద్ధ వహించాలి. ఇందు నిమిత్తం ఆరోగ్యకార్యక్రమాల్ని అభివృద్ధి పరచాలి. సంఘంలో సాఫీగా జీవితం గడపడానికేమి, విద్యార్జనకేమి యెక్కువ అవకాశాల్ని కల్పించాలి. వినోదకాలక్షేపానికి, సాంస్కృతిక కార్యకలాపాలకి సదుపాయం కల్పించాలి.

ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో రాష్ట్రంలో మొత్తం రూ. 71.06 లక్షల వ్యయంపై 21 పథకాలు అమలు పరచబడతాయి. ఈ పథకాలకి రూ. 3.28 లక్షల వరకూ కేంద్ర సహాయం లభిస్తుంది.

ప్రణాళికా కాలంలో రాష్ట్రంలో 9 సంక్షేమ కేంద్రాలు నెలకొల్పబడతాయి. ప్రతికేంద్రంలోను ఒక సంక్షేమ కేంద్రం ఆర్గనైజరు, ఆటల సూపర్ వైజరు, సినిమా ఆపరేటరు, నర్సు, నర్సరీస్కూలు టీచరు, సంఘసేవకుడు, వయోజన విద్యాబోధకుడు బంట్రోతు, చౌకిదారు, ఒక ఆయా వుంటారు.

పారిశ్రామిక భద్రత, ఆరోగ్యం, సంక్షేమాలను గురించి కార్మికులకు బోధించుటకై రాష్ట్రం మధ్యనున్న ప్రదేశంలో ఒక పారిశ్రామిక భద్రత మ్యూజియంను ప్రారంభించాలనికూడా సంకల్పించబడింది.

రాష్ట్రంలో తెరువబడిన మొత్తం 19 (9 పూర్తి కాలం పనిచేసేవి, 10 సగం కాలం పనిచేసేవి.) ఉద్యోగుల ప్రభుత్వభీమా డిస్పెన్సరీలు ద్వితీయ పంచవర్ష ప్రణాళిక కాలంలో కూడా పని చేస్తాయి. సికింద్రాబాదు కె. ఇ. ఎమ్. ఆస్పత్రిలోను, ఇర్రంనూమాలోని క్షయ ఆస్పత్రిలోను ప్రత్యేకం భీమాపొందిన కార్మికుల వుపయోగానికై విడిగా ఒక వార్డును నిర్మించాలనికూడా సంకల్పించబడింది.

అనంతపురంలో వున్న ప్రాంతీయవుద్యోగ సాధక వుపకేంద్రం విస్తరింప జేయబడుతుంది. ఆపైన శ్రీకాకుళంలో ఒక జిల్లా వుద్యోగసాధక కేంద్రం స్థాపించాలని సంకల్పం. తెలంగాణా ప్రాంతంలో హైదరాబాదులో వున్న రీజియనల్ డైరెక్టరేటుని, వరంగల్లులోవున్న ప్రాంతీయ వుద్యోగ సాధక కేంద్రాన్ని అఖిలభారత సంస్థతో కలపాలని, 7 జిల్లా వుద్యోగ సాధక కేంద్రాల్ని నెలకొల్పాలని సంకల్పం. రాష్ట్రంలో రెండు యువజన వుద్యోగ సహాయ యూనిట్లు, వుద్యోగ సలహా యూనిట్లు, కూడా నెలకొల్ప బడగలవు.

## వెనుకబడిన తరగతులు

దేశంలో వెనుకబడిన తరగతుల ఆర్థిక, సాంఘిక పరిస్థితిని మిగిలిన ప్రజల స్థాయికి కొనిరావాలని, ఆ పని రాజ్యాంగం అమలులోకొచ్చిన 10 సంవత్స

రాల లోగా జరగాలని భారత రాజ్యాంగం రాష్ట్రాలను ఆదేశిస్తున్నది. కాబట్టి ఈ పని పూర్వాంధ్ర రాష్ట్రంలో సాంఘిక సంక్షేమ శాఖ అని వ్యవహరింపబడే ప్రత్యేక శాఖకి, హైదరాబాదు రాష్ట్రంలో సాంఘికసేవా కార్యక్రమాల శాఖకి అప్పగించబడింది. రాష్ట్రంలో షెడ్యూల్డు కులాలవారు యించుమించు 46 లక్షల మంది ఉన్నారు.

వెనుకబడిన యీ తరగతుల సంక్షేమానికై పెక్కు పథకాలు అమలు పరచబడ్డాయి. తొలి పంచవర్ష ప్రణాళిక కాలంలో తగినంత అభివృద్ధి సాధించబడింది.

ద్వితీయ ప్రణాళిక కాలంలో, తొలి ప్రణాళిక కాలంలో ప్రారంభమైన పథకాలు కొనసాగించ బడతాయి. అవి యెక్కువ శీఘ్రంగా కూడా అమలు పరచబడతాయి. కాబట్టి షెడ్యూల్డు కులాలు, మాజీ నేరస్థ జాతులు, యితర వెనుక బడిన జాతుల సంక్షేమానికై రూ. 200.48 లక్షలు కేటాయించబడ్డాయి. మొత్తం 25 పథకాలు చేపట్టబడతాయి. కేంద్రప్రభుత్వం నుంచి గ్రాంట్ల రూపంలో రూ. 86.03 లక్షలు రాగలవని భావించ బడుతున్నది.

ప్రణాళికా కాలంలో హరిజనులకి మరి 8,400 విద్యార్థి వేతనాల్ని, వెనుకబడిన తరగతుల విద్యార్థులకి 19,698 విద్యార్థి వేతనాల్ని యివ్వాలని సంకల్పం. హరిజనులు, తదితరమైన వెనుకబడిన తరగతుల పిల్లలు క్రమేణా యెక్కువ మంది బడికి వెడుతున్నారు. వారికి వసతిగృహ సౌకర్యాలు అవసరం. కాబట్టి గ్రాంట్ల సంఖ్యని హెచ్చించాలని, అవసరమైన చోటెల్లా ముఖ్యంగా వెనుకబడిన జిల్లాల కొన్ని తాలూకాలలో కొత్త వసతి గృహాల్ని గుర్తించాలని సంకల్పం. కొత్తగా ప్రభుత్వ వసతి గృహాలు కూడా ప్రారంభింప బడగలవు.

హరిజనులు బాగా పేదవారైనందున యిళ్ల స్థలాల్ని యిచ్చినా వారు స్వంతయిళ్లు కట్టుకోలేక పోతున్నారు. కాబట్టి సబ్సిడీలను, అప్పులను యిచ్చి ఆ విషయంలో వారికి తోడ్పడాలి. ద్వితీయ ప్రణాళిక కాలంలో హరిజనులకి, వెనుక బడిన తరగతులకి 8,783 యిళ్లు కట్ట బడతాయి.

తెలంగాణాలో, ప్రణాళికా కాలంలో 6 అనాధ శరణాలయాల్ని, 6 భిక్షుక గృహాల్ని నెలకొల్పాలని కూడా సంకల్పించబడింది.

## షెడ్యూల్డు జాతులు

"వెనుక బడిన తరగతు" లనబడే నాలుగు వర్గాల ప్రజలలోను షెడ్యూల్డు జాతులు ఒక వర్గం. వీరెక్కువగా శ్రీకాకుళం, విశాఖపట్నం, తూర్పు. పశ్చిమ గోదావరులు, ఆదిలాబాదు, ఖమ్మం, వరంగల్లు, మహబూబునగరం, కరీంనగరం జిల్లాల్లో వున్నారు.

గిరిజన ప్రాంతాలలో అభివృద్ధి కార్యక్రమాల్ని స్థూలంగా నాలుగు రకాలుగా విభజించవచ్చు.

1. రాకపోకల సౌకర్యాలు, 2. విద్యా సంస్కృతులు, 3. గిరిజనుల ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి, 4. ఆరోగ్యం, గృహవసతి, నీటి సరఫరా.

ద్వితీయ ప్రణాళిక కాలంలో షెడ్యూల్డు జాతుల సంక్షేమానికై రూ 200.51 లక్షలు ఖర్చు కాగల 124 పథకాల్ని చేపట్టాలని సంకల్పం. ఇందులో రూ 100.163 లక్షల వరకూ కేంద్ర సహాయం లభిస్తుందని భావన. ఈ మొత్తాలు షెడ్యూల్డు జాతులకి తోడ్పడే ప్రత్యేక కార్యక్రమాలపై ఖర్చు పెట్ట బడతాయి. కాబట్టి అవి మొత్తం ప్రజానీకం అభివృద్ధికై అమలు జరిగే కార్యక్రమాలకి తోడుగా పని చేస్తాయి.

తూర్పుగోదావరి, విశాఖపట్నం, వరంగల్లు, ఖమ్మం, కరీంనగరం జిల్లాల్లో 5 కొత్త వసతిగృహాలు ప్రారంభింప బడతాయి.

చెంచుల అభివృద్ధికై [illegible]లో వసతి

గృహంతో కూడిన మరొక పాఠశాల, నల్లమల కొండల తూర్పు వెంపున పెదమంత్రాలలో ఒక ఆస్పత్రి, దోర్నాలలో ఒక సహకార సంఘం నెల కొల్ప బడతాయి.

పోలవరం, జీలుగుమిల్లి, అరకులలోని ఆస్ప త్రులు అభివృద్ధి చేయబడతాయి. జి. మడుగోల డిస్పెన్సరీ ఆస్పత్రిగా మార్చబడుతుంది. సుజనకోట, సీత.పేటలలో రెండు డిస్పెన్సరీలు, ఎల్విన్‌పేటలో ఒక ఆస్పత్రి తెరువ బడతాయి. ఇదిగాక, నాగూరు, సీత.పేట, పోలవరాలలో 3 సంచార వైద్య యూనిట్లు వుంటాయి.

వరంగల్లు, ఖమ్మం జిల్లాల్లో రెండు ప్రదర్శన క్షేత్రాల్ని ప్రారంభించి, గిరిజనులకి ఆధునిక వ్యవ సాయ పద్ధతుల్ని ప్రత్యక్షంగా చూపించి పని నేర్పడం జరుగుతుంది.

## స్త్రీసంక్షేమం

సమగ్రమైన సాంఘిక సంక్షేమ కార్యక్రమంలో యితర విషయాలతో బాటు స్త్రీ, శిశుసంక్షేమ పథ కాలు తప్పకుండా వుంటాయి. వారిలో దాదాపు అంతా ఆర్థిక స్వాతంత్ర్యం లేనివారే. కాబట్టి ఆర్థిక దుస్థితిలో వున్నప్పుడు వారు తప్పుచేసే అవకాశం యెక్కువ.

ద్వితీయ ప్రణాళిక కాలంలో రూ 24.26 లక్షల వ్యయం కాగల 6 పథకాల్ని చేపట్టాలని సంకల్పం.

ఈ పథకాలక్రింద, ద్వితీయ ప్రణాళిక కాలంలో 900 మంది అనాథలు, వితంతువులు, పరిత్యక్తులు, 360 మంది పిల్లలు సేవాకేంద్రాలలో చేర్చుకో బడతారు. అక్కడవారికి రక్షణ కల్పించడమే కాక, విద్య, వివిధ చేతివృత్తులు నేర్ప బడుతాయి కూడా. సుశిక్షితమైన సిబ్బంది కొరత సంక్షేమ కార్య క్రమాల అమలుకి ముఖ్యాటంకంగా వున్నది. కాబట్టి ఒక శిక్షణాకేంద్రం ప్రారంభింప బడుతుంది. అక్కడ 64 మంది స్త్రీ సంక్షేమ ఆర్గనైజర్లకి శిక్షణ యివ్వ బడుతుంది. నిరుద్యోగులైన ఆడపిల్లలకి. తక్కువ రాబడి వర్గాలు, వెనుక బడిన తరగతుల స్త్రీలకి ధనార్జనకి తగిన మార్గం చూపించవలసి వుంది. ఇందు నిమిత్తం వృత్తి విద్యాశిక్షణ కేంద్రాలలో టైపురైటింగు, సంక్షిప్త లేఖనం, వాణిజ్య విషయాలవంటి సాంకే తిక కోర్సుల్ని ప్రారంభించాలని ప్రణాళిక సంకల్పం. ఇందువల్ల 3,600 మంది స్త్రీలకి మేలు కలుగుతుంది. పరిస్థితుల ప్రభావంవల్ల దోవతప్పిన 226 మంది స్త్రీలని సన్మార్గంలో పెట్టి వారికి తగిన సహాయం చేయబడుతుంది. స్త్రీ సంక్షేమ సంస్థ శాఖలకి పరికరాలు మున్నగునవి సరఫరా చేయబడతాయి

## సాంఘిక సంక్షేమం

పరిష్కరించవలసిన ముఖ్యమైన సాంఘిక సమ స్యలు చాలా వున్నాయి. పేదరికం, అజ్ఞానం, అధిక జనాభా, గ్రామాలు వెనుకబడి వుండడం యివన్నీ యెంతో కొంత సమాజాన్ని పీడిస్తూనే ఉన్నాయి. సరైన గృహవసతి, తిండిలేక పోవడం, అపరిశుభ్రత, దైహిక, మానసిక అనా రోగ్యం, పిల్లల పెంపకంలో అశ్రద్ధ మున్నగునవి ఈ సమస్యలు తలెత్తడానికి కారణమవుతున్నవి. సాంఘిక సంక్షేమ కార్యక్రమాలలో మిక్కిలి ముఖ్యమైనవి స్త్రీ శిశు సంక్షేమానికి సంబంధించిన కార్యక్రమాలు.

తొలి పంచవర్ష ప్రణాళికలలో ఒక భాగంగా కేంద్రప్రభుత్వం ఒక కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘాన్ని యేర్పాటుచేసింది. స్త్రీలు, పిల్లలూ, పురోగమించలేని వర్గాల శ్రేయస్సుకై కార్య క్రమాల నేర్పాటు చేయుటలో స్వచ్ఛంద సేవా సంస్థలకి తోడ్పడ్డం ఈ సంఘ ప్రధానాశయం. ఈ కేంద్రం సంఘం మళ్లీ రాష్ట్ర ప్రభుత్వాలతో కలిసి రాష్ట్ర సాంఘిక సంక్షేమ సంఘాల నేర్పాటు చేసింది. ఈ సంఘం సంక్షేమ విస్తరణ ప్రాజె క్టుల్ని కూడా చేపట్టింది. అవి యివి : సామాజిక కేంద్రాలు, ప్రీ బేసిక్ స్కూల్సు, ప్రసూతి శిశువు, ఆరోగ్య సేవా కార్యక్రమాలు, స్త్రీల సాంఘిక

విద్య, లలితకళలు, వృత్తి విద్యల కేంద్రాలు, సాధారణమైన కొన్ని సాంస్కృతిక, వినోద కాలక్షేప కార్యక్రమాలు.

ఒక్కొక్క ప్రాజెక్టులోను ఒకదానితో ఒకటి చేరివున్న గ్రామాలు 25 ఉంటాయి. వాటి సగటు జనాభా 25,000. ఈ గ్రామాలకి బహుళార్థ సాధక సంక్షేమ కార్యక్రమంద్వారా సేవ చేయబడుతుంది. ప్రతి ప్రాజెక్టులోను సాధారణంగా అయిదేసి గ్రామాలకి ఒకటిచొప్పున 5 కేంద్రాలుంటాయి. ఈ కార్యక్రమాల్ని గ్రామస్థాయి స్త్రీ కార్యకర్తలు (పూర్తికాలం పని చేసేవారు) సగంకాలం పనిచేసే కార్యకర్తల సహాయంతో అమలు పరుస్తారు. వీరందరికీ కూడా ప్రాజెక్టు అమలు కమిటీ సన్నిహిత సహాయం లభిస్తుంది. ఈ కమిటీలో అధిక సంఖ్యాకులు జిల్లాలో పనిచేసే వివిధ సంక్షేమ విస్తరణ సంస్థలకి ప్రాతినిధ్యం వహించే అనధికార సాంఘిక సేవికలు. అధికారికంగా, జిల్లా పరిపాలనా వర్గ ప్రతినిధులు ఒకరిద్దరుంటారు.

ద్వితీయ ప్రణాళిక కాలంలో సంక్షేమ విస్తరణ ప్రాజెక్టుల కార్యక్రమంలో త్రిముఖ విస్తరణ తలపెట్టబడింది. దీని ప్రకారం, ద్వితీయ ప్రణాళిక సమాప్తినాటికి ప్రతిజిల్లాలోను 4 సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులుంటాయి. ప్రాజెక్టుల కయిన మొత్తం ఖర్చులో సగం కేంద్ర సాంఘిక సంక్షేమ సంఘం పెట్టుకుంటుంది. మిగిలిన దానిని రాష్ట్ర ప్రభుత్వం, ప్రజలు చెరిసగం పెట్టుకుంటారు. ఈ సంక్షేమ విస్తరణ ప్రాజెక్టులకై ద్వితీయ ప్రణాళికలో రూ. 37.37 లక్షలు కేటాయించబడ్డాయి. వీటిలో రూ. 18,69 లక్షల్ని గ్రాంట్ల రూపంలో కేంద్రప్రభుత్వ మిస్తుంది.

ద్వితీయ ప్రణాళిక కాలంలో 8 రాష్ట్ర సదనాలు, 10 జిల్లా రక్షణ గృహాలు ప్రారంభింపబడతాయి. ఇందు నిమిత్తం ప్రణాళికలో రూ. 12.66 లక్షలు కేటాయించ బడ్డాయి. రాష్ట్ర సదనాలు జైళ్లు మున్నగు వాటినుంచి విడుదలయే స్త్రీ పురుషుల 'అనంతర రక్షణ' కై వుద్దేశించబడ్డాయి. ఇట్టివ్యక్తుల్ని తమ కాళ్ల మీద తాము నిలబడేవరకూ యీ సదనాలలో వుండనిస్తారు. శిక్షణా—వుత్పత్తి యూనిట్లను నెలకొల్పి, వాటిలో వారికి తగిన వృత్తి పనుల్ని నేర్పాలని సంకల్పం. ప్రతి సదనంలోను 16–21 సంవత్సరాలు వయస్సుగల వారికై ప్రత్యేక విభాగాలుంటాయి. ప్రతి సదనంలోను దగ్గరగా 100 మంది చేర్చుకోబడుతారు. జిల్లా రక్షణ గృహాలు అనంతర శ్రద్ధ అవసరమైన వారికై వుద్దేశించబడినవి. రాష్ట్ర సదనాలలో ఏదో ఒక దానికి వెళ్లేవరకూ వారు తాత్కాలికంగా ఈ రక్షణ గృహాలలో వుంటారు. ప్రతి జిల్లా రక్షణ గృహంలోను పాతికేసి మంది వుంటారు.



# అభివృద్ధి కార్యక్రమ కేంద్రాల విశేషాలు



*గుడివాడ తాలూకా మోటూరులో బాలీయవికాస సేవాకేంద్రాన్ని 20-5-58న రాష్ట్ర ముఖ్యమంత్రి ప్రారంభించారు*

## గవర్నరు ఆగమనం

ఆంధ్రప్రదేశ్ గవర్నరు శ్రీ భీమ్‌సేన సచార్ ఏప్రిల్ 30వ తేదీని పెందుర్తిసమాజాభివృద్ధి కేంద్రాన్ని దర్శించి, అక్కడి కార్యక్రమాలు కొన్నింటిని తనిఖీచేశారు.

గవర్నరు 100 హరిజన కుటుంబాలకై నిర్మితమైన ఆదర్శగృహావసతి కాలనీకి రాగానే అక్కడ బ్లాక్ డెవలప్‌మెంటు ఆఫీసరు, జిల్లాప్లానింగు ఆఫీసరు, హరిజన నాయకులు ఆయనకి స్వాగతమి[illegible] కొత్తగా [illegible] యన్ను [illegible] చేశారు. [illegible] విశాఖ జిల్లా కలక్టరు వున్నారు. గ్రామీణుల ఆర్థిక స్థాయిని పెంపొందించుటకై గట్టిగా కృషిచేయాలని బ్లాకుసిబ్బంది సమావేశంలో ప్రసంగిస్తూ ఆయన నొక్కివక్కాణించారు. తరువాత ఆయన ఆరుబయలు నాటకరంగాన్ని, కొత్తగా నిర్మితమైన కార్యాలయ భవనాన్ని సందర్శించారు. ఆయన కొమ్ము వస్తువుల కేంద్రాన్నికూడా దర్శించి, అక్కడ పని వివిధ దశలను గమనించారు.

ప్రాథమిక ఆరోగ్య కేంద్రాన్ని దర్శించిన తరువాత ఆయన గ్రామసేవకులను కలుసుకుని వారి [illegible] వస్తున్నారు. గ్రామాభివృద్ధికై

కలిమెలిసి పనిచేయుమని వారికి చెప్పారు. తరువాత ఆయన వడ్రంగం, కమ్మరం కేంద్రాలను దర్శించి అక్కడ శిక్షణ పొందేవారు యెలాపనిచేస్తున్నారో చూశారు.

మే 4వ తేదీని గవర్నరు సతీసమేతులై కోటవురట్ల సమాజాభివృద్ధి కేంద్రాన్ని దర్శించి అక్కడ జరిగే కార్యక్రమాల్ని తనిఖీచేశారు. ఆయనకి శాసనసభ్యుడు శ్రీ రాజా సాగిసూర్యనారాయణ రాజు, స్థానికోద్యోగులు స్వాగతమిచ్చారు. ఆయనక్కడ ఒక్క గంటన్నర మాత్రమే వున్నారు. ఆ స్వల్పకాలంలోను ఆయన ముఖ్యంగా స్థానిక సమస్యల్ని గురించి అక్కడవున్న గ్రామీణులతో చర్చించారు. తమసమస్యల్ని వివరించమని ఆయన గ్రామీణుల్ని అడిగారు. అంతట వారు ప్రస్తుత సాగునీటి సౌకర్యాల్ని అభివృద్ధి పరచమని, నీటి పారుదలకి విద్యుచ్ఛక్తిని సంఫరా చేయుమని కోరారు. ప్రజలు క్రమంగా తమ పరిస్థితుల్ని చక్కబరుచుకోవాలని దానికి జవాబుగా ఆయన చెప్పారు. "జాతి నిర్మాణ కార్యక్రమాలలో మనం మనస్ఫూర్తిగా పాల్గొంటే మన అవసరాలన్నీ తీరుతాయి" అని ఆయన అన్నారు. చిన్న మొత్తాల పొదుపు పథకం ఆవశ్యకతను వివరిస్తూ దానిని "మనతక్షణావసరాలకి జవాబు"గా అభివర్ణించారు. లక్షమంది గ్రామీణులు మనిషికొక రూపాయచొప్పున యిచ్చినా లక్ష్యం సఫలంగా సిద్ధింపగలదని (ఈ ప్రాంతంలో, 1 లక్ష లక్ష్యానికి రూ 48,000 మాత్రమే వసూలయినవి) ఆ సందర్భంలో మాట్లాడిన శ్రీ రాజా సాగి సూర్యనారాయణరాజు అన్నారు.

ప్రదర్శనలు జరుపుటకై ప్రత్యేకం నిర్మింపబడిన ఆదర్శగృహాన్ని, బొమ్మలతయారీ కేంద్రాన్ని, మహిళాసమితుల్ని శ్రీమతి లలితానచార్ సందర్శించారు. స్త్రీల సమావేశంలో ప్రసంగిస్తూ, పిల్లలకి తగిన విద్యనేర్పుటలో శ్రద్ధవహించాలని ఆమె అన్నారు.

పశుపోషణకి సంబంధించిన కార్యక్రమాన్ని తనిఖీ చేసిన పిమ్మట గవర్నరు సతీసమేతంగా తమ వేసవి నివాస భవనానికి తరలి వెళ్లారు.

## గ్రామనాయకుల శిక్షణా శిబిరాలు

తిర్మలాయపాలెం సమాజాభివృద్ధి కేంద్రంలోని జాలపల్లి గ్రామంలో 23-4-58 నుంచి 25-4-58 వరకూ గ్రామనాయకుల శిక్షణా శిబిరం జరిగింది. 5 గ్రామాలనుంచి వచ్చిన 37 మందికి వ్యవసాయం, పశుపోషణ, సహకారం, నీటిపారుదల మున్నగు విషయాలలో శిక్షణ ఇవ్వబడింది. శిక్షణా కాలంలో జరిగిన శ్రమదానంతో గ్రామాల రోడ్లు బాగుచేయబడినవి.

సీతంపేట జాతీయ వికాస సేవా కేంద్రంలోని గొందిగ్రామంలో 21-4-58 నుంచి 26-4-58 వరకూ మొట్టమొదటిసారిగా ప్రత్యేకమైన గ్రామ సహాయకుల శిక్షణాశిబిరం జరిగింది.

శిక్షణ కెన్నుకబడిన 50 మంది గ్రామ సహాయకులలో 48 మంది రైతు ప్రతినిధులు, యిద్దరు ఉపాధ్యాయులు వున్నారు. రైతు ప్రతినిధులలో 37 మంది జటపుతెగకి, 11 మంది సవరతెగకి చెందినవారు ఉపాధ్యాయులిద్దరూ ఏజన్సీలో పనిచేసేవారు.

శిక్షణాశిబిరం 24-4-58న సీతంపేట బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు శ్రీ వై. సీతారామమూర్తిచే ప్రారంభింపబడింది. శిక్షణ పొందుటకు వచ్చినవారిలో ఒకరైన శ్రీ కె. సూరయ్య శిబిరానికి తొలినాడు అధ్యక్షుడుగా యెన్నికయినారు. ఆయన జాతీయ పతాకాన్ని యెగురవేశారు.

తరువాత శ్రీ సూరయ్య ఏజన్సీప్రజల దుర్భర పరిస్థితిని శిక్షణ పొందుటకు వచ్చినవారికి వివరిస్తూ, ఆధునిక వ్యవసాయ పద్ధతుల్ని అవలంబించి వారిపరిస్థితిని చక్కజేయాలని సలహాయిచ్చారు. ఆ సందర్భంలో బ్లాకు సాంకేతిక సిబ్బంది సహాయాన్ని పొందాలన్నారు. వ్యాపారస్థులు గిరిజనుల్ని దోచుకొనకుండా వారు సహకార సంఘాల్ని యేర్పరచుకుని, వాటిద్వారా తమ సరుకును అమ్ముకోవాలన్నారు.

గొంది గ్రామంలో జరిగిన శ్రమదానంలో అనగా పాఠశాలా భవనం, గ్రామస్థుల సావడి

నిర్మాణం, జిల్లా కలక్టరు, జిల్లా ప్లానింగు ఆఫీసరు పాల్గొన్నారు.

రెండవరోజు అధ్యక్షుడుగా శ్రీ పి. సూర్యనారాయణ యెన్నికయినారు. పాలకొండ-సీతంపేటరోడ్డు పాయింటునుంచి గొంది గ్రామానికి రోడ్డు నిర్మించే శ్రమదాన కార్యక్రమాన్ని విశాఖపట్నం గిరిజన సంక్షేమ డిప్యూటీ డైరెక్టరు ప్రారంభించారు. రాత్రి స్థానిక ఉపాధ్యాయుడు భాగవతం చదివారు. నీలకంఠపురం గ్రామస్థాయి కార్యకర్త సమూహాభివృద్ధిపై పాటలుపాడారు.

మూడవరోజు అధ్యక్షుడుగా శ్రీ ఎమ్. చిన్నయ్య యెన్నుకోబడ్డారు.

ఎక్స్టెన్షన్ సూపర్వైజరు శ్రీ కె. ఎ. పట్నాయక్ శిక్షణ పొందుటకువచ్చిన వారితో వారి గ్రామాలలోని సాగునీటి వనరులకి సంబంధించిన సమస్యలను, వాటి అభివృద్ధికిగల అవకాశాలనుగురించి చర్చించారు. వారి గ్రామాలలో చిన్నరకం సాగునీటి వనరుల బాగుకై వారు రొఖ్ఖం రూపంలో కాని లేక వస్తు రూపంలో కాని సహాయం చేయవలసిన అవసరాన్ని వివరించారు. పళ్లతోటలు వగైరాల పెంపకానికై ప్రకృతి సిద్ధమైన సెలయేళ్ల వుపయోగం గురించి కూడా చర్చించబడింది.

పందిరిసామాను, బియ్యం, కూరగాయలు, వంటచెరకు, పాలు వగైరాలను ప్రజలు యిచ్చారు. వీటి ఖరీదు రూ. 285 వుటుందని అంచనా. బ్లాకు నిధులనుంచి ప్రభుత్వం కేటాయించిన రూ. 75/ పూర్తిగా ఖర్చయిపోయాయి.

## మోటూరు కేంద్రం

రాష్ట్ర ముఖ్య మంత్రి శ్రీ ఎన్. సంజీవరెడ్డి 20-5-58 న విజయవాడ సమీపంలో మోటూరు గ్రామంలో జాతీయ వికాస సేవా కేంద్రాన్ని ప్రారంభించారు. ఈ పథకం విజయానికై ప్రజలు అధికార్లతో సహకరించాలని ఆ సందర్భంలో ఆయన విజ్ఞప్తిచేశారు. అది కృష్ణా జిల్లాలో 12వ కేంద్రమని గ్రామీణులను అక్షరాస్యుల్ని చేయుట యీ పథకం ఆశయాలలో ఒకటని ఆయన వివరించారు.

పరిపాలనా వికేంద్రీకరణ రాష్ట్ర ప్రభుత్వ విధానమన్నారు. ఆ ప్రకారం యీ విస్తరణ బ్లాకులలో యేర్పడబోయే బ్లాకు కౌన్సిళ్లలో గ్రామ పంచాయతీల అధ్యక్షులు సభ్యులుగా వుంటారనీ, ఒక పరిభుత్వోద్యోగి బ్లాకు కౌన్సిలు అధిపతిగా వుంటారనీ ఆయన వివరించారు.

ఈ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ పి. రంగారెడ్డి అధ్యక్షత వహించారు.



# ప్రశ్నోత్తరావళి

32 వ. ప్ర. (శ్రీ పి. రామిరెడ్డి, బనజాపల్లి, నిర్మల్ తాలూకా)

తెలంగాణా జనసంఖ్య యెంత?

దానిలో యెన్ని తాలూకాలున్నాయి ?

జవాబు: తెలంగాణా జనసంఖ్య 1,05,43,478. తాలూకాల సంఖ్య 67.

33 వ. ప్ర. (పి. డి. పి ఏలూరు)

ఆంధ్రప్రదేశ్‌లో బస్సురవాణా యెన్ని చోట్ల జాతీయం చేయబడింది ? జాతీయకరణ చాలకాలం పడుతుందనుకుంటున్నారు. ఎందువల్ల ?

జవాబు: ఆంధ్రప్రదేశ్ యేర్పడే సరికే అక్కడ బస్సురవాణా 9 జిల్లాల్లో జాతీయం అయివుంది. ఇప్పుడాపద్ధతి కృష్ణా జిల్లాకి కూడా వర్తింపచేయబడుతున్నది. జాతీయకరణ అన్ని జిల్లాలకికూడా క్రమేణా వర్తింపచేయబడుతుంది. ఈ సంస్థ నిర్వహణకై ఒక రోడ్డు రవాణా కార్పొరేషన్ యేర్పాటు చేయబడింది.

ఇందుకు సంబంధించిన యెవరికీ సాధ్యమైనంతవరకూ యేవిధమైన నష్టములేక అసౌకర్యము కలుగకుండా జాతీయకరణ ప్రజాస్వామిక పద్ధతిలో ప్రవేశపెట్టబడుతున్నది. కాబట్టి అది పూర్తి కావడం ఆలస్యమవుతుంది.

34 వ. ప్ర. (శ్రీ కె. వి. పరాంకుశదాసు, కంచిలి, శ్రీకాకుళం జిల్లా)

ఆంధ్రప్రదేశ్ జనాభాలో పురుషులెందరు ? స్త్రీలెందరు ?

జవాబు: ఈ వివరాలు యీ సంచిక రెండవ అట్టలోపలి భాగంలో వున్నాయి.

35 వ ప్ర. (శ్రీ లింగాల వెంకటరమణశర్మ చాగల్లు, పశ్చిమగోదావరి జిల్లా)

ఆంధ్రప్రదేశ్ సముద్రతీరం నిడివి యెంత?

జవాబు: ఇంచుమించు ఆరువందల మైళ్ళు.

36 వ. ప్ర. (శ్రీ ఎస్. ఓంప్రకాష్, హైదరాబాదు)

పంచవర్ష ప్రణాళిక ప్రధానాశయాలేమిటి ? అవి సామాన్య మానవునికెలా తోడ్పడుతుంది ?

జవాబు: మనరాజ్యాంగం ప్రకారం మన ఆర్థిక, సాంఘిక వ్యవస్థ సమానావకాశాలు, సాంఘికన్యాయం, పని హక్కులు, జీవనాధారమైన వేతనం హక్కుల ప్రాతిపదికపై యేర్పడాలి. పథక నిర్మాణం ప్రధానాశయం క్రమేణా అట్టి వ్యవస్థను నిర్మించడం. మొదట యీ పరమావధి శ్రేయో రాజ్యమని వ్యవహరింపబడింది. తరువాత అది 'సోషలిస్టు పద్ధతి సమాజం' గామారింది అంటే మొకటి విషయమే యెక్కువ నిర్దిష్టంగా యిలాచెప్పబడుతున్నది. తొలి పంచవర్ష ప్రణాళిక భావి భారతసౌభాగ్యానికి పునాదివేసింది. అలా ఆరంభమైన అభివృద్ధి కార్యక్రమాల్ని ద్వితీయ ప్రణాళిక కొనసాగిస్తున్నది. సంక్షిప్తంగా దాని ఆశయాలు యివి :

1. సత్వర పారిశ్రామికాభివృద్ధి,

2. జాతీయాదాయం పెంపు,

3. ఉద్యోగావకాశాల విస్తృత విస్తరణ,

4. ఆదాయసంపదలలో అసమానత్వాల తగ్గింపు.

పైన పేర్కొన్న 4వ. ఆశయం ప్రకారం అధికోత్పత్తి వల్ల సమకూరే లాభాలు సామాన్య మానవుని జీవన ప్రమాణాన్ని హెచ్చించుటకు వినియోగపడతాయి.

37 వ. ప్ర. ప్రణాళిక వుత్పత్తినేవిధంగా హెచ్చిస్తుంది?

జవాబు. వ్యవసాయోత్పత్తి హెచ్చుదలకై యెక్కువ నీటిపారుదల సౌకర్యాలు కల్పించబడతాయి. భూమి బాగుచేయబడి యెక్కువ లాభకరంగా వినియోగించబడుతుంది. మామూలు యెరువులు, రసాయన యెరువులు యెక్కువ వాడబడతాయి. ఉత్తమ విత్తనాలు వుపయోగించబడతాయి. ఆధునిక వ్యవసాయ పద్ధతులు అవలంబించబడతాయి. జాతీయ వికాససేవ, సహకారోద్యమాల వ్యాప్తి వల్ల స్థానిక సంపదరకాలకి యెక్కువ పెట్టుబడి లభిస్తుంది కనుక, అవికూడా వ్యవసాయాభివృద్ధికి తోడ్పడతాయి.

పారిశ్రామిక రంగంలో, ప్రభుత్వ, ప్రైవేటు విభాగాలను వుచితరీతిని సమన్వయ పరచుట ద్వారాను, అవసరమైనచోట విదేశ పెట్టుబడిని సంపాదించుటద్వారాను, చిన్నరకం పరిశ్రమలు, కుటీర పరిశ్రమలకి ప్రభుత్వ సహాయాన్ని హెచ్చించుట ద్వారాను అధికోత్పత్తి సాధించబడుతుంది

38 వ. ప్ర. లోటు ఆర్థిక విధానమంటే యేమిటి? దాని అర్థం యెక్కువ కరెన్సీ నోట్లను ముద్రించడమనా? అయితే, అది అధిక చలామణికి దారితీయదా? అధికచలామణీ దేశానికి హానికరం కాదా?

జవాబు. పన్నులు, ప్రభుత్వవ్యాపారాలనుంచి వచ్చే సంపాదన, ప్రజలనుంచి తీసుకునే అప్పులు, డిపాజిట్లు వగైరాలనుంచి తనకి వచ్చే ఆదాయాన్ని మించి ప్రభుత్వం ఖర్చుపెడితే దానిని లోటు ఆర్థిక విధానమంటారు. ప్రభుత్వం అట్టిలోట్లను తన అక్యూములేటెడ్ రొక్కం నిల్వలనుంచి తీసుకునో లేక రిజర్వు బ్యాంకినుంచి అప్పు తీసుకునో భర్తీచేయగలదు. ఈ రెండిటిలో యేదిజరిగినా, అందువల్ల డబ్బు సరఫరా యెక్కువవుతుంది. చలామణిలో వున్న డబ్బు హెచ్చి, అందుకు తగ్గట్టుగా సరుకు, పని హెచ్చకపోతే అధికచలామణీ యేర్పడుతుంది. కాబట్టి దాన్ని నివారించుటకు చర్య గైకొనాలి.

ఇందునిమిత్తం తీసుకొనే చర్యలు యే రూపంలోనైనా వుండవచ్చు: ఖచ్చితమైన ఆర్థిక, ద్రవ్య విధానం: పరపతి సౌకర్యాలు విస్తారం విస్తరించకుండా నిరోధించుట దీని ఆశయం. ఎందుచేతంటే పరపతి సౌకర్యాలు హెచ్చితే డబ్బు ధరల మార్పుకి కారణం కావచ్చులేదా అభివృద్ధి కృషికి వుపయోగపడకుండా 'స్పెక్యులేషన్' లోకి పోవచ్చు. రెండవది, ఆహార ధాన్యాలు, బట్ట, యితర ముఖ్య వస్తువులు అంటే వేటిధర పెరిగిపోతే పేదల జీవనవ్యయ ప్రమాణం హెచ్చుతుందో ఆ వస్తువుల్ని నిలవచేయడం. మూడవది, విచక్షణా సహితమయ్యే వెంటనే అమలులోకొచ్చే పన్ను విధింపు: దీనివల్ల అధికలాభాల్ని తుడిచిపెట్టి, లోటు ఆర్థిక విధానంవల్ల కలిగే హానికరమైన యితర ఫలితాల్ని నివారించవచ్చు. నాలుగవది, రేషనింగు వంటి భౌతికమైన కంట్రోళ్లు కూడా కొంత వరకూ వుపయోగపడవచ్చు.

39 వ ప్ర. (శ్రీ వి. లింగారెడ్డి, ముషంపల్లి, నల్గొండ జిల్లా)

తొలి పంచవర్ష ప్రణాళిక క్రింద విద్యపై యెంత ఖర్చు పెట్టబడింది ?

జవాబు. పూర్వాంధ్రరాష్ట్రంలో తొలి ప్రణాళిక కాలంలో విద్యా సంబంధమైన పథకాలపై రూ 30[illegible].82 లక్షలు ఖర్చుచేయబడినవి. ఇందుకు కేటాయించబడిన సొమ్ము రూ. 310-59 లక్షలు. ప్రణాళిక కాలంలో 1550 వృత్తి విద్యా పాఠశాలలు తదితరమైన పాఠశాలలు ప్రారంభింపబడినవి. విద్యావంతుల నిరుద్యోగ సమస్య పరిష్కారానికై ఏకోపాధ్యాయ పాఠశాలల్ని తెరచుటకుద్దేశించిన పథకం ప్రణాళిక చివరిరెండు సంవత్సరాల్లోను అమలు జరుపబడింది. దాని క్రింద 1829 పాఠశాలలు తెరువబడినవి. ఉన్నత, సాంకేతిక విద్యా సౌకర్యాలుకూడా అభివృద్ధి చేయబడినవి.

పూర్వ హైదరాబాదు రాష్ట్రి తెలంగాణా ప్రాంతంలో తొలి ప్రణాళిక కాలంలో సాధించిన అభివృద్ధి ప్రత్యేకంగా పేర్కొనబడలేదు. తొలి ప్రణాళిక ఆఖరు నాటికి తెలంగాణాలో యించుమించు 7[illegible]0[illegible] ప్రాథమిక పాఠశాలలు, 401 మాధ్యమిక పాఠశాలలు, 198 వున్నత పాఠశాలలు, మాధ్యమిక--వున్నత పాఠశాలలు, 12 సాంకేతిక, వృత్తి విద్యా సంస్థలు వున్నాయి.



ప్రణాళికారంగంలో

# ప్రచారవారోత్సవాలు

1958 ఏప్రిల్ 8, 14 తేదీల మధ్య కృష్ణాజిల్లాలో పంచవర్ష ప్రణాళిక ప్రచార వారోత్సవాలు జరుప బడినవి. ఆ సమయంలో బహిరంగసభలు, వూరేగింపులు, సాంస్కృతిక కార్యక్రమాలు, ప్రదర్శనలు మున్నగునవి జరుపబడినవి.

జిల్లా ముఖ్యపట్నం చిలకలపూడిలో జరిగిన బహిరంగసభకి జిల్లాకలెక్టరు అధ్యక్షత వహించారు. ద్వితీయ పంచవర్ష ప్రణాళిక క్రింది అభివృద్ధి పథకాలనుంచి సాధ్యమైనంత యెక్కువలాభాన్ని పొందమని ఆయన ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ ఆహారాన్ని అధికంగా పండించవలసిన ఆవశ్యకతను నొక్కి వివరించారు. మిగిలినవారి ప్రసంగాలయిన పిమ్మట ఆధునిక వ్యవసాయ పద్ధతులు, సాంఘిక విషయాలపై గూడూరు జాతీయ వికాస సేవాకేంద్రం యేర్పాటుచేసిన ప్రదర్శన స్టాలుకి ప్రారంభోత్సవం జరిగింది. వారం పొడుగునా ఫిల్ము ప్రదర్శనలు యేర్పాటు చేయబడినవి. ఆఖరి రోజున జరిగిన బహిరంగసభకి మచిలీపట్నం పురపాలకసంఘం అధ్యక్షుడు అధ్యక్షత వహించారు. రెండు నాటకాలు కూడా ప్రదర్శింపబడ్డాయి.

నూజివీడులో గ్రామసేవకులు, పంచాయతీ సిబ్బంది, అభివృద్ధి కేంద్రం సిబ్బంది శ్రమదానకార్యక్రమంలో పాల్గొన్నారు. ఏదరలో పారిశుద్ధ్యోద్యమం నడుపబడింది. అగిరిపల్లి, గొల్లపల్లి, బాపులపాడు, వేంపూరు గ్రామాలు కూడా యీ వారోత్సవాల్ని జరిపాయి.



*రాష్ట్ర గవర్నరు 9-4-58న పశ్చిమ గోదావరి జిల్లా గోపన్నపాలెంలోని విస్తరణ శిక్షణా కేంద్రాన్ని దర్శించారు. ఆయన చిన్నరకం పరిమార్పుడు యంత్రాన్ని వుపయోగిస్తున్న దృశ్యం.*

తిరువూరు సమాజాభివృద్ధి కేంద్రంలో కొండపర్వ, కోటిపల్లి, పుట్రేల, రేపూడి, వూటుకూరు గోసవీడు, చింతలపూడి మున్నగు వివిధ గ్రామాలలో బహిరంగసభలు జరిగాయి. కొన్ని గ్రామాలలో ప్రణాళికకి సంబంధించిన ప్రదర్శనలు, ఫిల్ము ప్రదర్శనలు కూడా యేర్పాటయినవి.

వీరపల్లి జాతీయ విస్తరణ సేవా కేంద్రంలో, ముఖ్య కార్యాలయం వున్న ప్రదేశంలో గ్రామీణ

ప్రదర్శన, అంతా ఒక్కుమ్మడిని పాల్గొన్న పారిశుద్ధ్యోద్యమం, పిల్లల ఆటలు జరుపబడినవి. గ్రామ స్థాయి కార్యకర్తల కార్యాలయాలుగల గ్రామాల న్నిటిలోను కూడా యిదేరకం కార్యక్రమాలు యేర్పాటైనవి.

మైలవరం జాతీయ విస్తరణ కేంద్రంలో, కొండూరు, చేవుటూరు, తుమ్మలగుంట, గన్నవగం, వెల్వడం, పుల్లూరు, వెల్లటూరులు యీ వారోత్సవాల్ని జరిపాయి.

గన్నవరం కేంద్రంలో, బుద్ధవరం హారిజన ప్రాంతంలో జరిగిన పారిశుద్ధ్యోద్యమంలో అంతాఒక్కుమ్మడిని పాల్గొన్నారు. గన్నవరంలో పిల్లల విన్యాసం జరిగింది. ఒక బహిరంగసభ జరిగింది. ఒక ఫిల్ము ప్రదర్శన జరుపబడింది.

బంటుమిల్లి, ముసునూరు, గూడూరు, కలిదిండి, నాగాయలంక కేంద్రాలలో కూడా యిట్టి కార్యక్రమాలే అమలు జరుపబడ్డాయి. ఈ ప్రచార వారోత్సవాల్ని తిరువూరు, గుడివాడ గన్నవరం, నందిగామ, కైకలూరు, విజయవాడల తహసీల్‌దార్లు యేర్పాటుచేశారు.

### నిజామాబాదు జిల్లా

పంచవర్ష ప్రణాళిక ప్రచార వారోత్సవాలు కామారెడ్డిలో జరుపబడ్డాయి. అక్కడ 1958 ఏప్రిల్ 14వ. తేదీన బడిపిల్లల వూరేగింపు జరిగింది. బహిరంగ సభ జరిగింది.

దోమకొండలో ఏప్రిల్ 12వ. తేదీన బహిరంగ సభ జరిగింది. జనతా కళాశాలా విద్యార్థులు ప్రణాళికపై బుర్రకథ చెప్పారు.

నాయిర్‌పేట కేంద్రం ముఖ్య కార్యాలయం వున్న చోటను, గ్రామస్థాయి కార్యకర్తల కార్యాలయాలున్న గ్రామాలలోనుకూడా యీ వారోత్సవాలు జరుపబడ్డాయి. ఈ సందర్భంలో ప్రభాతభేరీ, శ్రమదానం జరిగాయి. పారిశుద్ధ్యోద్యమంలో అంతా ఒక్కుమ్మడిని పాల్గొన్నారు. కొన్ని క్షేత్రాల సందర్శనానికి యేర్పాట్లు జరిగాయి. గ్రూపుచర్చలు, బహిరంగసభలు జరిగాయి. అభివృద్ధి కేంద్రం ముఖ్య కార్యాలయం వున్నచోట ఒక ప్రదర్శన జరిగింది.

నిజామాబాదు కేంద్రంలో ఒక ప్రదర్శన, డిమానుస్ట్రేషన్లు, వుపన్యాసాలు, ఫిల్ము ప్రదర్శనలు యేర్పాటు చేయబడినవి. పిల్లల ఆటల పోటీలు జరుపబడి హెడ్ క్వార్టర్సులో బహుమతులు యివ్వబడ్డాయి.



# మెహతా కమిటీ సూచనలు

(శ్రీ కె. వి. భాస్కరరావు, పబ్లిసిటీ అసిస్టెంటు, కృష్ణాజిల్లా)

భారతదేశం అధికంగా గ్రామాల దేశమనే విషయం ఎల్లరకూ తెలిసిందే. మనదేశానికి స్వాతంత్ర్యమొచ్చాక గ్రామీణ ఆర్థిక, సాంఘిక పరిస్థితులను చక్కబరచేటందుకు అనేక విధాలుగా ప్రయత్నాలు జరుగుతున్నాయి. ముఖ్యంగా 1952 అక్టోబరు 2 నుండి (బాపూజీ జన్మదినం) 'కమ్యూనిటీ ప్రాజెక్టులు', జాతీయ విస్తరణ సేవ, సాముదాయక అభివృద్ధి కార్యక్రమాలు మొదటి పంచవర్ష ప్రణాళిక ద్వారా గ్రామాభివృద్ధికి మరింత కృషి చేయసాగాయి. ఈ కార్యక్రమం ప్రారంభింపబడి ఈ నాటికి 6 సంవత్సరాలు గావస్తోంది. ఈ కాలంలో జరిగిన అభివృద్ధిని సమీక్షించేటందుకు, అవసరమైనచోట్ల మార్పులకు తగిన సలహాల నిచ్చేటందుకు భారతప్రభుత్వపు ప్రణాళికా సమితి, (Planning Commission) యొక్క ప్రాజెక్టులకమిటీ ఒక 'పరిశీలనా సంఘా'న్ని నియమించింది. ఆ కమిటీకి పార్లమెంటు సభ్యులు శ్రీ బల్వంతరాయ్ మెహతా నాయకత్వం వహించారు. ఈ కమిటీవారు దేశమంతా పర్యటించి తమ నివేదికను 3 భాగాలుగా సమర్పించారు. వీరి సూచనలు మెహతా కమిటీ సూచనలుగా పేరొందాయి. వాటి సారాంశాన్ని పరిశీలిద్దాం.

అభివృద్ధి పథకాల పట్ల తమ అభిప్రాయం తెలియజేస్తూ ప్రజలలో ప్రణాళికల పట్ల తగినంత ఉత్సాహం కల్గలేదనీ, గ్రామ పంచాయతీలుగాని వాటిపై గల యితర స్థానిక సంస్థలుగాని ఈ కార్యక్రమాలలో తగినంతగా పాల్గొనడం లేదనీ వారు తెలియజేశారు. అందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు పంచవర్ష ప్రణాళిక ద్వారాగాని, యితర అభివృద్ధి పథకాల ద్వారాగాని నిర్వహిస్తున్న పనులన్నీ పంచాయతీలకు వెంటనే వప్పగించాలని సూచించారు. ప్రస్తుతం అభివృద్ధి పథకాల క్రింద వున్న సిబ్బందిని, ద్రవ్యాన్ని పంచాయతీల అధీనంలో వుంచి అభివృద్ధిని కొనసాగించాలని మెహతా కమిటీ వుద్దేశం. కాశ్మీరు, సౌరాష్ట్ర, బీహారు రాష్ట్రాలలో ఈ పద్ధతివల్ల సత్ఫలితాలు కలిగాయి. ప్రాథమిక ప్రజాస్వామ్యం ప్రాతిపదికగా అధికార వికేంద్రీకరణమే కమిటీ నివేదికలోని ముఖ్యాంశం. అందుకు పంచాయతీ సమితితోకూడిన 'బ్లాకు' అన్ని అధికారాలు కల్గి పని ప్రారంభిస్తే నిజమైన గ్రామ రాజ్యమేర్పడుతుందని వారు సూచించారు. అట్టి 'బ్లాకు' మరీచిన్నదిగా గాని మిక్కిలి పెద్దదిగా గాని లేక మధ్యస్థంగా వున్నట్లయితే పనులు సత్వరంగా జరుగుతాయి. నేడమలులో వున్న 'బ్లాకు సలహా సంఘాల' స్థానే పంచాయతీ సమితుల నేర్పరచి వాటికి తగిన సిబ్బంది, ధనం చేకూర్చడంవల్ల స్థానికావుసరాలను బట్టి పని చేయడానికి వీలవుతుంది. ఆయా బ్లాకులలో వున్న పంచాయతీ బోర్డు మెంబర్లు పరోక్షపు ఎన్నిక ద్వారా పంచాయతీ సమితులను ఎన్నుకొంటారు. సమితి కాలపరిమితి 5 సంవత్సరాలుంటుంది. సమితి అధ్యక్షుడు కూడ ఎన్నుకొనబడే ప్రతినిధిగానే వుంటాడు. కాని అనుభవంకోసం మొదటి రెండు సంవత్సరాలు మాత్రం సబ్ డివిజనల్ ఆఫీసరుగాని, ఆహోదాగల యితర అధికారిగాని సమితి అధ్యక్షులుగా వుండాలని కమిటీ సిఫారసు చేసింది. ఇంకా ఈ సమితిలోనికి యిద్దరు స్త్రీలను, షెడ్యూల్డుకులాలు, తెగలనుండి చెరొక ప్రతినిధిని తీసికొనవచ్చును.

పంచాయతీ సమితి వ్యవసాయం, స్థానిక వృత్తుల అభివృద్ధి, రోడ్లు, నీటిసరఫరా, విద్య, ఆరోగ్యం మొదలగు రంగాల అభివృద్ధికి కృషి చేస్తుంది. ఈ రంగాలలో ప్రభుత్వంనుండిగాని, ప్రభుత్వాధికారులనుండిగాని, జోక్యంలేకుండ పంచాయతీ సమితి వ్యవహరిస్తుంది. మెహతా కమిటీ ఉద్దేశం ప్రకారం గ్రామీణ సంపూర్ణాభివృద్ధి పంచాయతీ సమితి చేతిలో వుంటుంది. ఈ సమితి ఆర్థికసహాయంకోసం ప్రభుత్వంమీద ఆధారపడకుండ బ్లాకునుండి వచ్చే భూమిశిస్తు, వృత్తిపన్ను, స్థిరాస్థి మార్పుపై సర్ చార్జి, ఛాఅద్దె, వినోద-యాత్రిక పన్నులు మొదలైన విధానాల ద్వారా ద్రవ్యాన్ని చేకూర్చుకొన వచ్చును. ఇందుకు పన్నులు, ప్రభుత్వపు గ్రాంటులతోసహా 13 మార్గాలను కమిటీ పేర్కొంది. పంచాయతీ సమితిలో పనిచేస్తున్న ఉద్యోగుల జీతాలు ఆయా రాష్ట్రప్రభుత్వాలే భరిస్తాయి. సమితి మాత్రం అలవెన్సులు మున్నగు చిన్న మొత్తాలను భరిస్తుంది. రాష్ట్రప్రభుత్వం పంచాయతీ సమితులకు ఆర్థిక, సాంకేతిక సహాయమిస్తూ మార్గదర్శిగా వుంటుంది. అవసరమైనచోట్ల ప్రజాక్షేమం దృష్ట్యా సమితులను ప్రభుత్వమే రద్దుచేస్తుంది. అంతమాత్రంచేత రాష్ట్రప్రభుత్వపు పూర్తి జోక్యం కూడదని కమిటీ అభిప్రాయం.

పంచాయతీ సమితిక్రింద గ్రామ పంచాయతీ, పైన జిల్లా పరిషత్తులు పనిచేస్తాయి గ్రామ పంచాయతీలో ఒకే గ్రామమున్నట్లయితే స్థానికమైన అభిప్రాయ భేదాలుండడానికి వీలుంటుంది. కాబట్టి గ్రామ పంచాయతీ మరికొంత విస్తృతంగా వుండాలనీ, యిప్పటి గ్రామస్థాయి కార్యకర్త (Village level worker) కున్న గ్రామాలైనా వుండాలనీ కమిటీ సూచించింది. ఇక జిల్లా పరిషత్తును ఆ జిల్లాలో వున్న పంచాయతీ సమితుల అధ్యక్షులు ఎన్నుకొంటారు. ఇందులో జిల్లా అధికారులు, శాసన సభ్యులు, పార్లమెంటు సభ్యులు కూడ వుంటారు. పంచాయతీ సమితి బడ్జెటును జిల్లా పరిషత్తు ఆమోదిస్తుంది. జిల్లా పరిషత్తుకు జిల్లా కలెక్టరు అధ్యక్షులుగాను, ఇతర అధికారులలో ఒకరు కార్యదర్శిగాను ఉంటారు. తమ సిఫారసులు సత్ఫలితాల నిచ్చేటందుకు గాను పంచాయతీ, పంచాయతీ సమితి, జిల్లా పరిషత్తు ఒకేసారి పని ప్రారంభించాలని యీకమిటీ తెలియజేసింది.

మెహతా కమిటీ సూచించిన మరికొన్ని ముఖ్య విశేషాలు.—

1. అభివృద్ధి పథకాలలో యిప్పుడున్న జాతీయ విస్తరణసేవ, (National extension service) సాముదాయక అభివృద్ధి, (Community development) అనంతర తీవ్రకృషి (Pos intensive) దశలవల్ల ప్రజలలోను, ఉద్యోగుల లోను ఈ కార్యక్రమాలు తాత్కాలికమేమోనన్న అనుమాన మున్నది. భారత దేశంలో గ్రామీణాభివృద్ధి కొద్దికాలంలో ఎలాగూ సాధ్యంగాదు కాబట్టి ఈ భేదాలను తొలగించాలి.

2. రెండవ ప్రణాళికాంతానికి అభివృద్ధి పథకాలను దేశంలోని ప్రతి ప్రాంతానికి వ్యాపింపజేయడం సాధ్యంగాదు. ఒకవేళ సాధ్యమైనా తగిన న్యాయం జరుగదు. అందువల్ల ఈ వ్యాప్తిని 1961 తర్వాత మరొక 3 సంవత్సరాలు పొడిగించాలి.

3. ఇప్పుడున్న జిల్లా కలెక్టర్లు అభివృద్ధి కార్యక్రమాలను మరింత శ్రద్ధగా నిర్వహించేటందుకు ప్రతి జిల్లాలోను మరొక కలెక్టరును నియమించాలి.

4. ప్రస్తుతం బ్లాకులలో పనిచేస్తున్న సాంఘిక విద్యా నిర్వాహకుల (స్త్రీ)హోదాను 'ముఖ్య సేవిక'గా మార్చి వారిచే స్త్రీల, పిల్లల సంక్షేమ కార్యక్రమాలకు కృషి చేయించాలి.

5. ఆహార ధాన్యాలకు కనీసధరలను నిర్ణయించి రైతులలో అధికాహారోత్పత్తి పట్ల ఉత్సాహం కల్గించాలి.

6. ప్రతి ఏటా రెండు పంటలను ప్రోత్సహించే టందుకు రెండవ పంటపై నీటిపన్నును తగ్గించాలి.

ఈ విధంగా మెహతా కమిటీ సూచనలు ఆర్థికంగాను పరిపాలనా దృష్ట్యాను ప్రజలలో మరింత శక్తిని, ఉత్సాహాన్ని కల్పించి, వీలైనంత తక్కువ ప్రభుత్వపు జోక్యంతో స్థానికావసరాలను తీర్చుకొనడానికవకాశమిస్తున్నాయి.

మన దేశంలోగల రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్, మద్రాసు రాష్ట్రాలు మాత్రమే ఈ సూచనలను స్థానిక మార్పులతో అమలు జరిపేటందుకు ముందుకొచ్చాయి. మన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జిల్లాకొక 'బ్లాకు కౌన్సిలు' నేర్పరచి ప్రయోగాత్మకంగా చూడ నిర్ణయించడంద్వారా మరొక అడుగు ముందుకు వేసింది.

మెహతా కమిటీ సూచనలు ప్రజాస్వామ్యానికొక సవాలు. ప్రభుత్వంనుండి ప్రజలకు సంక్రమిస్తున్న ఈ అధికార మెంతవరకు సద్వినియోగమైతే ఆమేరకు ప్రజలు చైతన్యవంతులనీ, ప్రజాస్వామ్య విజయానికిది శుభసూచకమని ఋజువౌతుంది. అందుకు తోడ్పడవలసినవారు ప్రజలే.



# మేలుకొలుపు

(శ్రీ బొడ్డు ప్రకాశం, బ్లాకు డెవలప్‌మెంటు ఆఫీసరు, మంగళగిరి)

పల్లెలు పట్టణంబులయి
ప్రాభవమందెడు వేళయయ్యెనీ
చల్లని తెన్గుతల్లికి య
శంబును గూర్చుము తెన్గువాడ, నీ
యుల్లముప్పల్లవింప నవి
గోమస జాతిప్రతిష్ఠ నిల్పుచున్
మెల్లగసాగె తెన్గు పొలి
మేరల దాటి వికాస కేంద్రముల్.

భరత రత్నంబు జవహారు పండితుండు
దేశ సౌభాగ్యగరిమ సాధింప నేడు
పంచవర్ష ప్రణాళికా భవ్య రథము
నడుపుచున్నాడు ప్రజలకానందమొసగ.

కాంక్షింపవోయి సౌఖ్యములీను పథకాలు
గ్రామాభివృద్ధికై కలిసి మెలసి
సాధింపవోయి నిశ్చలదృష్టిసారించి
పల్లెసీమలభావి ప్రాభవంబు
తిలకింపవోయి జాతీయవిస్తరణ సే
వాకేంద్రముల భవ్యభాగ్యరేఖ
నిర్మింపవోయి సున్నితమైన మార్గాలు
గ్రామగ్రామాల సౌఖ్యమ్ములరసి

సగము నీవంతు సర్కారు సగమువంతు
రెండు సగములు గలసిన కచ్చితముగ
పనులు సాధింపవోయి తెనుగవీర!
లెమ్ము నీయూరి బాగుకై లేచి రమ్ము.
ప్రజలు రాజులు రాజులే ప్రజలు నేడు
భరతరాజ్యంబు పాలించుభవ్యులైన
పాలకులలోన నీవును పాలకుడవె
పంచవర్ష ప్రణాళికా ఫలమునెంచి
తరలి రావయ్య తెనుగు సోదరుడ నీవు:

తెలుగునేల సస్యముల శ్యామలముచేయ
మేలురకమైన విత్తనాల్ మెచ్చి తెచ్చి
పంట పండించి గాదెల పదిలపరచి
కరువుమాప్పంగ రావోయి భరత వీర.

దేశము బాగుకోసమయి
తీవ్రముగా కృషిసల్పవోయి; యా
వేశము మీఱ జాతియభి
వృద్ధికి తోడ్పడవోయి ఆంధ్రుడా!
దేశము నీదె; నీవె మన
దేశముసేలెడు రాజవోయి; నీ
దేశము సర్వసౌఖ్యముల
దేల్చెడు భాగము నిల్పె నీవయిన్.



# "ఆంధ్రప్రదేశ్" ప్రకటనరేట్లు

—★—

'ఆంధ్రప్రదేశ్' పత్రికలో ఈ దిగువ రేట్లప్రకారం ప్రకటనలు స్వీకరించబడగలవు.

| వివరాలు | మూడు భాషల పత్రికలకు | | | ఒక భాష పత్రికకు | | |
|---|---|---|---|---|---|---|
| | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ | పూర్తి పేజీ | సగం పేజీ | పావు పేజీ |
| | రూ | రూ | రూ | రూ | రూ | రూ |
| లోపలి పేజీ | 200 | 125 | 75 | 100 | 55 | 30 |
| వెనుకవైపు కవరు పేజీ | 350 | — | — | 150 | — | — |
| 2, 3 కవరు పేజీలు | 250 | — | — | 125 | — | — |

ఒక సంవత్సరం కొరకు స్థలమును కంట్రాక్టు తీసుకొన్నవారికి 10 శాతం రిబేటు ఇవ్వబడుతుంది.

## షరతులు

1. సాంకేతిక వివరాలు: $10\frac{3}{4} \times 8\frac{1}{2}$" డెమ్మీ.
2. ముందరి టైటిల్ పేజీపై ప్రకటనలు వేయబడవు.
3. పావు పేజీకంటే తక్కువ ప్రకటనలు స్వీకరించబడవు.
4. ప్రకటించవలసిన విషయము, అది వేయబడవలసిన స్థలము మొదలగు వివరాలూ, దానికయ్యే మొత్తమూ ప్రతినెల 8వ తేదీలోపుగా ఈ కార్యాలయానికి చేరినట్లయితే, ఆ ప్రకటన మరుసటినెల పత్రికలో ప్రచురింపబడుతుంది. ప్రకటనకయ్యే మొత్తమును మనియార్డరు ద్వారాగాని, లేక క్రాస్ చేయబడని డిమాండు డ్రాఫ్ట్ ద్వారాగాని పంపవలెను. డిమాండు డ్రాఫ్టు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ సమాచార పౌర సంబంధముల శాఖ డైరెక్టర్, హైదరాబాదు–దక్కన్ పేరిట వ్రాయబడవలెను.
5. ప్రకటన నిమిత్తమై పంపబడు బ్లాకుల విషయంలో తగు జాగ్రత్త వహింపబడుతుంది. అయితే మిషను మీద బ్లాకులు గనుక పగిలిపోయినట్లయితే అందుకు ఈ శాఖ బాధ్యతవహించదు.
6. ప్రకటన ఎంత స్థలంలో ఏవైనం ప్రకారం వేయవలసిందీ, ఒక భాష పత్రికలో వేయవలెనా, లేక మూడు భాషల పత్రికలలో వేయవలెనా అనే వివరాలను స్పష్టంగా తెలియపరచాలి. ఉత్తర ప్రత్యుత్తరాలను, పైకమును ఈ దిగువ చిరునామాకు పంపవలెను.

డైరెక్టర్,
సమాచార, పౌరసంబంధముల శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు దక్కన్ — 1.

ప్రకటన

# ఆంధ్రప్రదేశ్

యొక్క

## స్టాటిస్టికల్ ఆబ్‌స్ట్రాక్టు, 1956

ఆంధ్రప్రదేశ్ ఎకనమిక్సు, స్టాటిస్టిక్సు బ్యూరో,
హైదరాబాదు

చే ప్రకటింపబడిన

(పునర్వ్యవస్థీకృత ఆంధ్రప్రదేశ్ రాష్ట్రతొలి సంచిక)

దీనిలో

జనాభా, వ్యవసాయం, పరిశ్రమలు, ఖనిజసంపద, పబ్లిక్ ఫైనాన్సు, ధరవరలు, వుద్యోగం, విద్య, పంచవర్ష ప్రణాళిక మున్నగు వివిధ విషయాలకి సంబంధించిన రాష్ట్ర జిల్లాల వారీ సంఖ్యా వివరాలు వున్నాయి.

వెల రూ. 5/-

ప్రతులకై :

డైరెక్టరు, గవర్నమెంటు పబ్లికేషన్ బ్యూరో,

మింటు బిల్డింగ్సు, హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్

చిరునామాకి వ్రాయవచ్చు.

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం

| | | |
|---|---|---|
| వైశాల్యం | ... | 106,041 చదరపు మైళ్లు |
| జనసంఖ్య | ... | 3,12,60,133 |
| పురుషులు | ... | 1,57,42,912 |
| స్త్రీలు | ... | 1,55,17,221 |
| సగటు వర్షపాతం | | |
| ఆంధ్ర ప్రాంతం | ... | 34.6 అంగుళాలు |
| తెలంగాణా | ... | 36.7 ,, |
| 1954–55 లో | | |
| ఆంధ్ర | ... | 41.5 ,, |
| తెలంగాణా | ... | 34.9 ,, |
| అరణ్య ప్రదేశం | ... | 1,40,26,000 ఎకరాలు |
| జిల్లాలు | ... | 20 |
| తాలూకాలు | ... | 183 |
| రెవిన్యూ సర్కిళ్లు | ... | 1,000 |
| పట్టణాలు | ... | 293 |
| గ్రామాలు | ... | 26,450 |
| పంటల క్రింది ప్రదేశం | ... | 2,93,81,000 ఎకరాలు |
| 1955-56 లో | | |
| సాగునీరు లభించిన ప్రదేశం | .... | 66.8 లక్షల యెకరాలు |
| కౌళ్ల సంఖ్య | ... | 42,42,655 |
| 1955-56 లో | | |
| వుత్పత్తి అయిన ఆహారధాన్యాలు | ... | 50.39 లక్షల టన్నులు |
| పశువులు | .... | 2,95,13,000 |
| కోళ్లు | ... | 1,47,37,000 |
| పాల వుత్పత్తి | ... | 15:5 లక్షల గేలన్లు |
| రైలుమార్గాలు | ... | 2,902 మైళ్లు |
| జాతీయ రహదార్లు | ... | 1,409 ,, |
| రాష్ట్ర రహదార్లు | ... | 2,072 ,, |
| జిల్లా పెద్దరోడ్లు | ... | 8,527 ,, |
| జిల్లా ఇతరరోడ్లు | ... | 3,458 ,, |
| పాఠశాలలు | ... | 28,000 |
| కళాశాలలు | ... | 47 |
| వృత్తి విద్యా కళాశాలలు | ... | 31 |



రాష్ట్ర ముఖ్యమంత్రి 21-5-1958న నాగార్జునసాగర్ ప్రాజెక్టువద్ద ఆనకట్ట పనిని తనిఖీచేశారు